# ద్రవ్యం



మూలం :

ఎమిలీ బరన్స్



అనుసరణ :

చంద్రం



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 2.

# విషయ సూచిక





# పరిచయం

ఆర్థిక శాస్త్రాన్ని, మార్క్సిస్టు సూత్రాలను సులభంగా సామాన్య పాఠకులకు అర్థమయ్యే విధంగా బోధించడంలో బ్రిటిష్ రచయిత ఎమిలీ బరన్స్ సిద్ధహస్తులు. వారు Money (ద్రవ్యం) అనే గ్రంథాన్ని వ్రాశారు.

ఐతే ద్రవ్యం, దాని ప్రయోజనాలు, పరిణామం వివరించేటపుడు ఎమిలీ బరన్స్ సహజంగానే బ్రిటిష్ ఉదాహరణలను తీసుకున్నారు. బ్రిటనులో స్టాండర్డ్ నాణెమైన పౌను, దాని చరిత్రను గురించి సాకల్యంగా చర్చించారు. అందుచేత ఆ పుస్తకాన్ని మక్కీకి మక్కీ అనువదించితే, సామాన్య భారతీయ పాఠకునికి సులభంగా అవగాహన కాదు. కాబట్టి నేను అనువాదానికి పూనుకోలేదు. ఎమిలీ బరన్స్ రచనా విధానాన్ని అనుసరించుతూ, భారతీయ ఉదాహరణలు యివ్వడానికి ప్రయత్నించాను.

బ్రిటిష్ నాణెం పౌను చరిత్ర బదులు, భారతదేశ స్టాండర్డ్ నాణెమైన రూపాయి చరిత్రను వివరించాను. బ్రిటిష్ ప్రభుత్వముండగా వాళ్ళు భారత దేశంలో అనుసరించిన కరెన్సీ విధానాన్ని గురించి, పౌను - రూపాయి మారకపు రేటుపై సామ్రాజ్య వాదులకు - జాతీయ వాదులకు మధ్య వాదోపవాదాలను గురించి క్లుప్తంగా చెప్పాను. రూపా

యికి - విదేశ నాణాలకు ప్రస్తుత మారకపు రేటులను, భారత ప్రభుత్వ కరెన్సీ విధానాన్ని స్వల్పంగా తెలియజేశాను.

నేను స్వతంత్రించి చేసిన మార్పులు, కూర్పులు ఫలితంగా దీనిని అనువాద మనడానికి వీలులేదు. స్వతంత్ర రచనగా చెప్పుకోవడమూ సబబుకాదు. బ్రిటిష్ పాఠకులకు సులభంగా అవగాహనయ్యేందుకు ఎమిలీ బరన్స్ వ్రాసిన 'మనీ' అనే శాస్త్రీయ గ్రంథాన్ని, తెలుగు పాఠకులకు సులభంగా అర్థమయేలాగ తిరిగి వ్రాయడానికి ప్రయత్నించాను.

అందుచేత ద్రవ్యం, దాని ప్రయోజనాలకు సంబంధించిన సిద్ధాంత భాగాలను సులభతరం చేసిన ఘనత ఎమిలీ బరన్స్‌కే దక్కుతుంది. భారతీయ వుదాహరణలు యివ్వడంలోనూ, మార్పులు కూర్పులు చేయడంలోనూ పొరపాట్లు దొర్లితే అందుకు బాధ్యత నాది. సహృదయులు పొరపాట్లను నాదృష్టికి తెస్తే, మరుసటి ముద్రణలో సవరించుతాను. సామాన్య విజ్ఞానం కలిగిన తెలుగు పాఠకునికి ద్రవ్యశాస్త్రాన్ని అర్థంచేసుకోడానికి ఈ చిన్ని పుస్తకం ఏమాత్రం వినియోగించినా సంతోషించుతాను.

విజయవాడ
1—10—'58

భవదీయుడు,
చంద్రం.

## పారిభాషిక పదాలు

Money = ద్రవ్యం

Circulation = చెలామణి

Transaction = సరఫరా

Exchange = మారకం

Value = విలువ

Price = ధర, వెల

Standard unit of Money = ద్రవ్య కొలమానం

Sale & Purchage = క్రయ విక్రయాలు

Barter = వస్తుమార్పిడి పద్ధతి



ముఖ్య గమనింపు :- 9 వ పేజీ 2 వ పేరా 6 వ పంక్తిలో పొరపాటు దొర్లింది. "ఉదాహరణకు 1958 ఆగస్టు నెలలో కొన్ని వందల కోట్ల కరెన్సీ చెలామణిలో వుందని రిజర్వు బ్యాంకు ప్రకటన చెబుతోంది" అని అచ్చుపడింది. దానిని క్రింది విధంగా సవరించుకోవాలని పాఠకులకు మనవి :

"ఉదాహరణకు 1958 ఆగస్టు నెలలో మొత్తం 23 వందల కోట్ల రూపాయల ద్రవ్యం చెలామణిలో వుందని రిజర్వుబ్యాంకు ప్రకటన చెబుతోంది" అని చదువుకోవాలి.

# 1. ద్రవ్యం: దాని ఉపయోగాలు

ఆధునిక దేశాలలో నాణాల రూపంలోవున్న ద్రవ్యాన్ని గురించి ప్రజలందరికీ తెలుసు. నాణాలే గాక ద్రవ్యంగా చెలామణి అవుతున్న అనేక రకాల నోట్లను కూడ మనం ఎరుగుదుం. ప్రభుత్వం తరఫున రిజర్వుబ్యాంకు సరఫరా చేస్తున్న కర్రెన్సీనోట్లు, ఇతర బ్యాంకులు జారీ చేసే చెక్కులు, డ్రాఫ్టులు, పోస్టాఫీసు సరఫరా చేసే పోస్టల్ ఆర్డర్లు, ప్రయాణీకుల చెక్కులు వగైరా వివిధ రకాల కాగితపు ద్రవ్యం చెలామణి అవుతూంది. వాస్తవానికి కాగితపు నోట్లన్నీ "ఇంత ద్రవ్యం చెల్లించుతామని వాగ్దానం" చేసే పత్రాలు మాత్రమే.

ఉదాహరణకు రూపాయి కర్రెన్సీ నోట్లమీద "ఈ నోటు తెచ్చేవారికి ఒక రూపాయి చెల్లించుతా"నని వాగ్దానం చేస్తూ రిజర్వుబ్యాంకు గవర్నరు సంతకం వుంటుంది. అలాగే అన్నిరకాల కర్రెన్సీ నోట్లమీద ఇంత మొత్తం ద్రవ్యం చెల్లించగలననే వాగ్దానంక్రింద రిజర్వు బ్యాంకు గవర్నరు సంతకం వుంటుంది. అందుచేత కర్రెన్సీ నోట్లు ప్రభుత్వం తరఫున రిజర్వుబ్యాంకు గవర్నరు వ్రాసే ప్రామిసరీనోట్లుగా భావించవచ్చు.

ప్రతి దేశంలోనూ ద్రవ్యాన్ని లెక్కకట్టేందుకు నిర్దిష్టమైన కొలమానం వుంది. మనదేశంలో రూపాయి అలాంటి కొలమానం. బ్రిటనులో పౌను, అమెరికాసంయుక్తరాష్ట్రాలలో డాలర్, ఫ్రాంసులో ఫ్రాంకు, సోవియట్ యూనియన్

లో రూబుల్, చైనా ప్రజారిపబ్లిక్‌లో 'యువాన్' నాణకలో వున్నాయి.

తక్కిన నాణాలన్నీ ఈ స్టాండర్డు కొలమానంలో భాగాలుగా మాత్రమే ఎంచబడుతున్నాయి. ఉదాహరణకు మన దేశంలోరూపాయిలో 16వ వంతును అణాగాను, 64వ వంతును కానీగాను, 192వ వంతును పైసాగానూ ఎంచుతున్నారు. ప్రభుత్వం కొత్తగా ప్రవేశపెట్టిన నయాపైసాను రూపాయిలో నూరోవంతుగా ఎంచుతున్నారు. రూపాయి విలువలో ఫలానా వంతు విలువకు చిహ్నంగానే తక్కిన నాణాలను ఎంచుతున్నారు. అంతేగాని వాటికి ప్రత్యేకంగా స్వతంత్రమైన విలువ లేదు.

యుద్ధానికి పూర్వపు రోజుల్లో రూపాయి నాణెం తులం బరువుగల వెండితో సమానంగా ఎంచబడేది. రూపాయి నోటుకు రూపాయి నాణెంగాని, తులం వెండిగాని యివ్వడానికి ప్రభుత్వం హామీపడేది. గోల్డ్‌స్టాండర్డు వున్నరోజుల్లో బ్రిటనులో పౌను నోటు యిస్తే బంగారు నాణెం (నవరసు), లేకపోతే ఔన్సులో నాలుగోవంతు బరువుగల బంగారు లోహాన్ని ప్రభుత్వ బ్యాంకు యిచ్చేది.

ఇపుడా హామీలేమీ లేవు. పౌను నోటుకు ఇంగ్లాండు బ్యాంకు నవరసు బంగారాన్ని యివ్వదు. మనదేశంలో రిజర్వు బ్యాంకు రూపాయి నోటుకు తులం వెండి యివ్వదు. రూపాయి నాణెంలో పూర్వంవలె తులం వెండి నేడు లేనూ లేదు. రూపాయి నాణెంలో నేడున్న మిశ్రమ లోహాల విలువ నాలుగణాలకు లోపుగానే వుంటుంది.

ఎవరైనా రూపాయి నోటు తీసుకువెళ్ళి, రిజర్వు బ్యాంకు గవర్నరును తులం వెండి యివ్వమంటే, నిరాకరించుతాడు. నికిల్ రూపాయిని గాని, చిల్లర నాణాలను గాని, మరోనోటును గాని మాత్రమే యిస్తాడు. యుద్ధానికి పూర్వపు రోజులనాటి వెండి రూపాయి అదృష్టవశాత్తు మీ యింట్లో వుందనుకోండి. దానిని అమ్ముకుంటే - దానిలో వున్న తులం లోహపు ఖరీదు-రూపాయిన్నర-లభించుతుంది. ఇప్పటి నికిల్ రూపాయిని కరిగించి అమ్మాలనుకుంటే ఏమి వస్తుంది?

మనం నిత్య జీవితంలో అనేక వస్తువులను - వాటి వాస్తవిక స్వరూపాన్ని తెలుసుకోకుండానే-వాడుతుంటాము. విద్యుచ్ఛక్తి ఎలా తయారవుతుందో అర్థంగాకపోయినా, నిత్యం మీటనొక్కి ఎలెక్ట్రిక్ దీపాల వెల్తురును వినియోగించుకుంటున్నాం. అలాగే ద్రవ్యం నిజస్వరూపం ఏమిటో తెలుకోకుండానే మనమంతా ద్రవ్యాన్ని వినియోగించుతున్నాం. విద్యుద్దీపాలను వాడుకుంటున్నట్లుగానే వస్తువులను కొనడానికి అమ్మడానికి నిత్యం రూపాయలను వాడుతున్నాం. వస్తువుల కొనుగోలుకు రూపాయలను ప్రతివారు యిచ్చి పుచ్చుకుంటున్నారు.

మన దేశంలో రూపాయిని మారకపు నాణెంగా ప్రతివారు ఎందుకు అంగీకరించుతున్నారనేది వేరేవిషయం. ద్రవ్యం బంగారు వెండి లోహాల రూపంలో వున్నపుడు, దానికి వస్తుతః విలువ వుండేది (ఈ సంగతి తరువాత వివ

రించుతాను.) అందుచేత వస్తువులను పరస్పరం మార్చుకోడా నికి రూపాయలను సాధనంగా వినియోగించుకోవడం ప్రారంభ మయింది. వర్తకం అభివృద్ధిచెందడంతో, ద్రవ్యంగా వాడు తున్న రూపాయిలోని లోహపు విలువ ఏమైనప్పటికీ, మారక పు సాధనంగా దాని ప్రాముఖ్యత పెరుగుతూ వచ్చింది. ప్రతివారు ద్రవ్యాన్ని మారకపు సాధనంగా గుర్తించుతున్నం దున ద్రవ్యరూపాలు (రూపాయి, పౌను, డాలరు, రూబుల్ వగైరాలు) ద్రవ్యంగా ఆయా దేశాలలో చెలామణి అవు తున్నాయి.

ఉదాహరణకు ప్రస్తుతం రూపాయి నాణెంలో వున్న లోహపు విలువ పావలా మాత్రమే వున్నప్పటికీ, రూపాయి విలుగల వస్తువులను కొనడానికి అది సాధనంగా ఉపయోగపడు తోంది. రూపాయి నాణెం అరిగిపోయినప్పటికీ రూపాయిగా చెలామణీ అవుతోంది. తరువాత నాణాలకు బదులు కర్రెన్సీ నోట్లు మారకపు సాధనంగా చెలామణి అయ్యే పద్ధతి అమల్లోకి వచ్చింది. బ్యాంకు చెక్కులు, పోస్టల్ ఆర్డర్లు వగైరా కూడ క్రమంగా ద్రవ్యంగా చెలామణి అవుతున్నాయి. పెద్దమొత్తా లను చెల్లించడానికి యిప్పుడు సర్వసాధారణంగా బ్యాంకు చెక్కులు, డ్రాఫ్టులు వగైరా వాడుతున్నారు. చిన్న మొత్తా లకు మాత్రమే కర్రెన్సీనోట్లు, రూపాయి నాణాలు వాడు తున్నారు.

అనేకతరాలుగా గుర్తించబడిన ద్రవ్యంయొక్క రూపాలు మారినప్పటికీ, అగమ్యగోచరమైన రూపం ధరించినప్పటికీ

మారకపు సాధనంగా అది చెలామణి అవుతోంది. బంగారు స్టాండర్డు వదలివేసినప్పటికీ, ప్రస్తుత నాణాలకు కాగితపునోట్లకు వస్తుతః విలువ లేనప్పటికీ ద్రవ్యం మారకపు సాధనంగా విని యోగించుతోంది. నాణాలపై ముద్రించిన విలువను, కరెన్సీ నోట్లపై అచ్చొత్తిన విలువను ప్రతివారు గుర్తించుతున్నారు. అందుచేత వివిధరూపాలలోవున్న ఈ ద్రవ్యం వస్తువుల మార్పిడికి, ఉత్పత్తికి ఉపయోగపడుతోంది.

క్రయ విక్రయాలలో కరెన్సీనోట్ల స్థానే బ్యాంకు చెక్కులు, డ్రాఫ్టులు వగైరా ఎంతవరకు వాడకంలో వున్నాయో అంచనావేయడం కష్టం. కరెన్సీ నోట్లు ఎంతమొత్తం చెలామణిలో వున్నాయో రిజర్వుబ్యాంకు ప్రతి వారం ప్రకటించే లెక్కలను బట్టి తెలుస్తుంది. ఉదాహరణకు 1958 ఆగస్టు నెలలో కొన్ని వందల కోట్ల కరెన్సీ చెలామణిలో వుందని రిజర్వుబ్యాంకు ప్రకటన చెబుతోంది. కాని యిందులో కొంత ద్రవ్యం బ్యాంకులలోనూ, ట్రెజరీలలోనూ నిల్వలోవుండి, వాస్తవానికి చెలామణిలో లేకపోవచ్చు. ఆకస్మిక అవసరాలకోసం అలా కొంతమొత్తం నిల్వవుంచుతారు. ఐతే బ్యాంకులు వ్యక్తులకు చెల్లించిన కరెన్సీనోట్ల విషయం వేరు. ఒక్కరోజులోనే అవి పదిహేనుసార్లు చేతులు మారవచ్చు. లేదా ఒకరి జేబులోనే వారం రోజులు నిలకడగా వుండొచ్చు. అందుచేత సంవత్సరంలో కరెన్సీ ద్వారా ఎంతమొత్తం ద్రవ్యం సరఫరా జరిగిందో (Transaction) అంచనా వేయడం అసాధ్యం.

బ్యాంకు చెక్కుల ద్వారా జరిగే ద్రవ్యం సరఫరా (Transaction) మరోవిధంగా వుంటుంది. సెంట్రల్ బ్యాంకి మీద యిచ్చినచెక్కును ఒక వ్యాపారస్తుడు ఇండియన్ బ్యాంక లో చెల్లింపుకు పంపుతాడనుకోండి. సెంట్రల్ బ్యాంకు నుంచి ఆ ద్రవ్యాన్ని నేరుగా ఇండియన్ బ్యాంకు రాబట్టుకోదు. ఆ చెక్కును క్లియరింగ్ హౌసుకు పంపి, ఇండియన్ బ్యాంకు - సెంట్రల్ బ్యాంకుల మధ్య వున్న లావాదేవీలన్నీ సరిచూస్తారు. ఇండియన్ బ్యాంకుకు సెంట్రల్ బ్యాంకు చెల్లించ వలసిన చెక్కుల మొత్తాన్ని, సెంట్రల్ బ్యాంకుకు ఇండియన్ బ్యాంకు చెల్లించవలసిన చెక్కుల మొత్తాన్ని సరి చూచి, మిగులు మొత్తానికి స్టేటు బ్యాంకుపై చెక్కు యిస్తారు. స్టేటు బ్యాంకులో పై రెండు బ్యాంకులకు వున్న ఖాతాలలో జమలు - ఖర్చులు వ్రాసి, మొత్తం లావాదేవీ సంతటినీ సరి పుచ్చుతారు. ఒకే బ్యాంకులో ఖాతాదార్లుగా వున్న వ్యక్తుల మధ్య జరిగే ద్రవ్యం మార్పిడిని, అందజేయవలసిన వారి ఖాతాలో జమకట్టి చెల్లించవలసినవారి ఖాతాలో ఖర్చువ్రాయడం ద్వారా ఆబ్యాంకు లావాదేవీలను సరిపుచ్చు తుంది. ఈ విధంగా ఒకే బ్యాంకు ఖాతాదార్ల మధ్య జరిగే ద్రవ్య మార్పిడి లెక్కలు క్లియరింగ్ హౌస్ అంచనాలలో చేరవు. కాని యిది కూడ చాల పెద్ద మొత్తంగానే వుంటున్న దనడంలో సందేహంలేదు.

ఈవిధంగా అనేక రూపాలలో చెలామణి అవుతున్న ద్రవ్యం ఎంత మొత్తం వుంటుందో తెలిపే లెక్కలు లేవు కాని చెలామణిని వివిధ తరగతులుగా విభజించవచ్చు.

మొదటి విషయం ఏమంటే వేతనాలు, జీతాలు చెల్లించే నిమిత్తం కరెన్సీ నోట్లు, నాణాల రూపేణా పెట్టుబడి దారులు బ్యాంకుల నుండి ద్రవ్యం తీస్తుంటారు. ఈ ద్రవ్యం కార్మికులకు చెల్లించుతారు. కార్మికులు యిళ్ళ అద్దెను చెల్లించడానికి, ఆహారం తదితర జీవితావసరాలు కొనడానికి ఆ ద్రవ్యాన్ని వినియోగించుతారు. తద్వారా కరెన్సీనోట్లు, నాణాలు ఇళ్ళ యజమానుల, దుకాణదారుల చేతుల్లోకి పోతాయి. తిరిగి వారు తమ ఖాతాలున్న బ్యాంకుల్లో ఆ ద్రవ్యాన్ని జమకడతారు. మరుసటి వారం తిరిగి పెట్టుబడి దారులు తమ ఖాతాలున్న బ్యాంకుల నుండి ద్రవ్యం తీయడం, కార్మికులకు వేతనాలు చెల్లించడం, వారు ఇళ్ళ అద్దెకు ఆహారం వగైరాలకు ఆ ద్రవ్యం ఖర్చుచేయడం, ఇళ్ళయజమానులు దుకాణాదారులు తిరిగి ఆ ద్రవ్యాన్ని బ్యాంకులలో జమకట్టడం - యిది నిత్యం జరుగుతున్న వ్యవహారకాండ.

అనగా ద్రవ్యం కార్మికుల శ్రమశక్తిని పెట్టుబడిదారులు వారం రోజులపాటు కొనడానికి వినియోగపడింది; కార్మికుల చేతుల్లోకి వెళ్ళాక వారి కుటుంబ అవసరాలను తీర్చడానికి, వారంరోజులు జీవించగలగడానికి వినియోగపడింది. కార్మికుడు తన శ్రమశక్తిని అమ్ముకొనేందుకు, జీవితావసరాలను తీర్చుకోవడం ద్వారా శ్రమశక్తిని నిలబెట్టుకొనేటందుకు సాధనంగా వినియోగపడింది.

పెట్టుబడిదారు ముడిపదార్థాలు కొనడానికి, బొగ్గు వగైరా ఉత్పత్తి కవసరమైన ఇతర సాధనాలను కొనడానికి

కూడ ద్రవ్యం అవసరమవుతుంది. అంతేగాక వుత్పత్తిదారుల నుండి ముడిపదార్థాలను సూటిగా పెట్టుబడిదారు కొనడం లేదు. వుత్పత్తిచేసేవారికి పరిశ్రమ యజమానికి మధ్య అనేక అంతరువులుగా దళారులు వున్నారు. ఉదాహరణకు ఆంధ్ర ప్రదేశ్‌లో పండే ప్రత్తి బొంబాయి బట్టలమిల్లులకు చేరే లోపున అనేక చేతులు మారుతోంది. రైతుల వద్ద ప్రత్తి వ్యాపారి దాన్ని కొంటాడు. జిన్నింగ్ మిల్లు యజమానికి అమ్ముతాడు. విత్తనాలు తీశాక జిన్నింగ్‌మిల్లు యజమాని దూది వ్యాపారికి అమ్ముతాడు. దూది వ్యాపారి బట్టల మిల్లుకు అమ్ముతాడు. ఈవిధంగా రైతులు పండించే ప్రత్తి బొంబాయి బట్టల మిల్లుకు చేరేలోగా అనేక చేతులు మారుతోంది. తద్వారా పరిశ్రమ యజమానికి చేరేలోగా సరుకు విలువకు మించి అనేకరెట్లుద్రవ్యం చెలామణిఅవుతోంది. బట్టలమిల్లులో తయారైన బట్టలు కూడ అదేవిధంగా దళారీల ద్వారా అనేకసార్లు చేతులు మారుతూ, చివరకు వినిమయదారుకు అందుతున్నాయి. సరుకు చేతులు మారినప్పుడల్లా ద్రవ్యం చెలామణీ అవుతోంది. తన ఉపయోగానికి కొంటున్న విని మయదారుతో ఈ వ్యవహారకాండ ముగుస్తోంది. ద్రవ్యం చెలామణి అవసరం అంతటితో ఆగిపోతుంది.

ఈ సరఫరా వ్యవహారాలన్నిటిలోనూ కార్మికుల శ్రమ శక్తిని కొనడం మొదలు, ఉత్పత్తి పంపకాలలో అన్ని దశల లోనూ అవసరమైన వస్తువులను కొనడానికి, సరుకు మార్పి

డికి ద్రవ్యం తప్పనిసరి అవుతోంది. అందుచేత మనజీవితానికి అవసరమైన వివిధవస్తువుల వుత్పత్తి, పంపకం సక్రమంగా జరగాలంటే ఈ లావాదేవీ లన్నిటిలోనూ మారకపు సాధనంగా ద్రవ్యం అవసరమౌతోందని చెప్పవచ్చు.

ఇంతేగాక అనేక యితర విధాలుగాకూడ ద్రవ్యవాడకం జరుగుతోంది. ఉదాహరణకు స్టాక్ ఎక్స్ఛేంజ్ మార్కెటులో షేర్లు (వాటాలు) కొనడానికి, అమ్మడానికి కూడ ద్రవ్యం అవసరమవుతోంది. అచట వాస్తవానికి అమ్ముతున్నదీ, కొంటున్నదీ ఏమిటి? కోటి రూపాయలు పెట్టుబడి వున్న ఒక కంపెనీలో 10 లక్షల వాటాలున్నా యనుకుందాం. ఆ కంపెనీలో వాటాధర అసలు 10 రూపాయలు మాత్రమే. స్టాక్ ఎక్స్ఛేంజిలో ఒక వాటా నేడు కొన్నవానికి ఆ కంపెనీ పెట్టుబడిలోనుంచి ఆ వాటాకు రావలసిన మొత్తాన్ని కొనుగోలు దారుకు ఆ కంపెనీ యివ్వదు. ప్రతి సంవత్సరం "సంపాదించిన" లాభంలోనుంచి ఒక వాటాకు వచ్చే భాగాన్ని పుచ్చుకునే హక్కుమాత్రమే వాటాదారుకు వస్తుంది. ఆ లాభం కంపెనీ ఎలా సంపాదించిందనే విషయం వేరే అధ్యాయంలో చర్చించుదాం. ఇచట మనం గమనించవలసిందల్లా ఒకటే. స్టాక్ ఎక్స్ఛేంజ్ మార్కెటులో జరిగే ఈరకం బేరాలకు సరకుల సరఫరాతో ఎలాంటి నిమిత్తం లేదు. అందుచేత కేవలం భవిష్యత్‌లో లాభం పంచుకునే హక్కును సంపాదించడానికి మాత్రమే స్టాక్ ఎక్స్ఛేంజ్ మార్కెటులో ద్రవ్య మార్పిడి జరుగుతోంది.

భవిష్యత్తులో లాభంగావచ్చే ద్రవ్యాన్ని పంచుకునే హక్కును ఈవిధంగా కొనడం, అమ్మడం నిత్యం జరుగుతోంది. ఇలాంటి వాటాల అమ్మకం, కొనుగోలు ధరలు నిత్యం మారు తున్నాయి. వీటిని బట్టి ద్రవ్యానికి మరొక వినియోగం వుందని – చట్టా వ్యాపారం చేసేందుకు ఉపయోగపడుతుం దని – మనకు బోధపడుతుంది అంటే ఏదైనా కంపెనీ భవి ష్యత్తులో సంపాదించే లాభం పంచుకునే హక్కును కొనేం దుకుగాను వాటాలను ఖరీదు చేయడమేగాక, అలాంటి వాటా లను కొన్న ధరకంటే ఎక్కువ ధరకు అమ్మి డబ్బు చేసుకో డానికి కూడ 'ద్రవ్యం' వినియోగించుతుందన్నమాట.

స్టాక్ ఎక్స్ఛేంజి మార్కెటులో కొనేందుకు, అమ్మేం దుకు వివిధ కంపెనీల వాటాలు వున్నాయి. వాటిని కొని, ఆ యా కంపెనీలలో తమ ద్రవ్యాన్ని పెట్టుబడి పెట్టాలని కొంటున్నారా ? లేక కేవలం చట్టా వ్యాపారంకోసం (స్పెక్యులేషన్ కొరకు) కొంటున్నారా ? –అనే సంగతి వేరు. వాస్తవానికి కంపెనీ మొదట ప్రారంభించినప్పుడు వాటాలను అమ్మకానికి ప్రజలముందుంచుతుంది. ద్రవ్యం చెల్లించి, ప్రజలు వాటాలను – భవిష్యత్తులో లాభాలను పంచుకునే హక్కును – కొంటారు. వాటాలను అమ్మగా వచ్చిన ద్రవ్యం తో స్థలాన్ని, భవనాలను, యంత్రాలను, పరిశ్రమ కవసర మైన ముడిపదార్థాలను, బొగ్గును, తదితర సరుకులను ఆ కంపెనీ కొంటుంది. ఉత్పత్తి విధానంలో పాల్గొనే పనివారికి వేతనాలను అజమాయిషీ చేసే వుద్యోగుల జీతాలను చెల్లించ డానికి కొంత ద్రవ్యాన్ని ఆ కంపెనీ ప్రత్యేకించుతుంది. వాస్త

వికమైన విధంగా ద్రవ్యాన్ని వినియోగించడం, ద్రవ్యాన్ని పెట్టుబడిగా రూపొందించడం యిదే. వస్తూత్పత్తికి పెట్టుబడిని వినియోగించి, "అదనపు ద్రవ్యాన్ని" ఉత్పత్తిచేయడానికి లేదా, లాభాలు సంపాదించడానికి మార్గం యిదే. ఈ విధానమంతటిని గురించి మూడవ అధ్యాయంలో వివరంగా చర్చించుకుందాం.

స్టాక్ ఎక్స్ఛేంజి మార్కెటులో కంపెనీ వాటాలను కొనడం, అమ్మడం వగైరా తతంగమంతా కేవలం భవిష్యత్తులో రానున్న లాభాలను పంచుకునే హక్కుకు సంబంధించినది మాత్రమే. అలాంటి క్రయ విక్రయాలకు వస్తూత్పత్తితో ఎలాంటి సంబంధమూ లేదు. కంపెనీ వాటా వేయి చేతులు మారినా, స్టాక్ ఎక్స్ఛేంజి బేరాల ద్వారా ఎవరైనా డబ్బు చేసుకున్నా, అది కేవలం చట్టావ్యాపారం పేర జరిగే జూదం మాత్రమే. మానవులకు అవసరమైన వస్తువులను తయారు చేయడంలో గాని, ద్రవ్యాన్ని ఎక్కువచేయడంలో గాని చట్టా వ్యాపారానికి ఎలాంటి పాత్ర లేదు. అది కేవలం వ్యక్తులమధ్య జరుగుతున్న జూదంలాంటిది మాత్రమే; ఒక వ్యక్తి జేబులోనుంచి ద్రవ్యం మరొకరి జేబులోనికి చేరుతోంది. అంతేగాని ఈ మార్పిడి ఫలితంగా అదనపు సంపద వుత్పత్తి కావడం లేదు.

ద్రవ్యాన్ని అప్పుగా యివ్వడమనేది ప్రస్తుతమున్న పాడుకలలో మరొకటి. వివిధ రకాలైన అప్పులు యిస్తూండడంవల్ల కూడ ద్రవ్యం సరఫరా (Transaction) మరింత ఎక్కువగా జరుగుతోంది. వస్తువులను గాని, వాటాలను

గాని మరొకటిగాని కొనడానికి వినిమయదారువద్ద ద్రవ్యం వున్నపుడు మాత్రమే సాధ్యమవుతుంది. అందుచేత కొను గోలుదారువద్ద ద్రవ్యం వుండటమనేది ద్రవ్యచెలామణి (సర్కు లేషన్) విధానమంతటికి కీలకమనవచ్చు. స్నేహితులు ఒండొ రులకు చేబదుళ్ళు యిచ్చే విధానాన్ని వదలివేస్తే, ధనవం తులు తమ సత్వర అవసరాలకుమించిన ద్రవ్యం తమవద్ద వున్న పుడు యితరులకు అప్పుగా యిస్తున్నారు. ఆ ద్రవ్యాన్ని అప్పుగా తీసుకొన్న పారిశ్రామికులు ముడిపదార్థాలను బొగ్గును కొనడానికి, కార్మికుల 'వేతనాలను' చెల్లించడానికి, వస్తూత్పత్తి, పంపకానికి అవసరమైన పనులన్నిటికీ వినియో గించుతున్నారు. కంపెనీలలో వాటాలను కొనడానికి, చట్టా వ్యాపారానికి (స్పెక్యులేషన్) మరికొందరు వినియోగించు తున్నారు.

ఎన్నిరకాలుగా అప్పులు యివ్వడం, పుచ్చుకోవడం జరుగుతోందో మన మిచట పరిశీలించ నవసరంలేదు. సామాన్య మానవులు తమవద్ద నిల్వ వున్న ద్రవ్యాన్ని మాత్రమే అప్పు యివ్వగలుగుతారు. కాని బ్యాంకులు ద్రవ్యాన్ని సృష్టించి అప్పుగా యివ్వగలుగుతాయి.

పెట్టుబడి కొరతవున్న వ్యక్తులు, కంపెనీలు అప్పు తెచ్చి, వస్తూత్పత్తిని, పంపకాన్ని కొనసాగించ గలుగుతున్నారనేది మనం గమనించవలసిన సంగతి. వాళ్ళు తమ కవసరమైన ద్రవ్యాన్ని బ్యాంకులనుంచి అప్పు తెచ్చి వాడుకుని, నెలా రెండు నెలల్లో తిరిగి చెల్లించుతున్నారు. అలాగే బ్యాంకు

నుండి మరికొందరు అప్పుగా ద్రవ్యం తీసుకువెళ్ళి కొలది కాలానికి తిరిగి యిస్తున్నారు. ఇలా చేతులు మారుతున్న పెట్టుబడి బ్యాంకులు లాభాలు గడించడానికి వినియోగించుతోంది.

అప్పులివ్వడం, పుచ్చుకోవడం సాగుతుండటం వల్లనే 'ద్రవ్య మార్కెటు' అనేది ఏర్పడుతోంది. ఈ మార్కెటుకు రుణం కావలసినవాళ్ళు "డబ్బు" కొనుక్కోడానికి వస్తున్నారు. అప్పుగా తీసుకున్న ద్రవ్యాన్ని తిరిగి చెల్లించేవరకు యింతవడ్డీ రేటు చెల్లించుతామని అంగీకరించుతున్నారు. వస్తూత్పత్తి, పంపకం బాగా సాగుతున్నపుడు, సాధారణ వర్తకానికి చట్టా వ్యాపారానికి కూడ అప్పులు ఎక్కువగా అవసరమవుతాయి' స్టాక్ ఎక్స్చేంజిలో స్పెక్యులేషన్ వ్యాపారం ఉవ్వెత్తుగా (Boom) సాగేటపుడు అప్పులు ఎక్కువ కావలసివస్తాయి. వ్యాపారమాంద్యం ఏర్పడినపుడు అప్పుల అవసరం కూడ తగ్గుతుంది. అలాంటి సమయాల్లో వడ్డీరేటు తగ్గుతుంది; కావలసినంత ద్రవ్యం అప్పుగా దొరకుతుంది. ఇలాంటపుడే పత్రికలు "ద్రవ్యం కొల్లలుగా" వుందని (Money is plentiful) అని వ్రాస్తాయి. చాలమంది తమ ద్రవ్యాన్ని అప్పుగా యివ్వడానికి సిద్ధంగా వున్నారనీ, రుణం కావలసినవాళ్ళు తక్కువగా వున్నారనీ, అందుచేత వడ్డీరేటు పడిపోయిందనీ మన కర్థమవుతుంది.

ధరల హెచ్చుతగ్గులను అనుసరించి ద్రవ్య వినియోగం కూడ పెరుగుతూ తరుగుతూ వుంటుంది. ధరలు హెచ్చుగా వున్నపుడు వస్తూత్పత్తికి పంపకానికి ఎంత ద్రవ్యం కావాలో,

ధరలు తక్కువగా వున్నపుడు అంత ద్రవ్యం అవసరముండదు. కాని ధరలు పడిపోవడం వల్ల లాభాలు రాకపోగా నష్టాలు వస్తాయి. రెండో వైపున ధరలు పెరుగడంతో పాటు వస్తూత్పత్తికి, పంపకానికి (అలాగే స్పెక్యులేషన్‌కు) ఎక్కువ ద్రవ్యం అవసరమౌతుంది. అలాగే అవసరాలకు తగినట్లుగా ఎక్కువ ద్రవ్యాన్ని బ్యాంకులు సృష్టించుతాయి.

వ్యాపార సరళిని అనుసరించి చెలామణీ ద్రవ్యం (సర్క్యులేషన్ ద్రవ్యం) ఒకపుడు హెచ్చడం మరొకపుడు తగ్గడం జరుగుతుంది. కాని దీర్ఘ కాలాన్ని దృష్టిలో వుంచుకుని పరిశీలించితే ప్రతి దేశంలోనూ ద్రవ్యం మొత్తంమీద క్రమంగా పెరుగుతూనేవుంది. ద్రవ్యం వస్తుమార్పిడికి సాధనంగా వినియోగించుటతో పాటు, విలువకు కొలమానంగా కూడ ద్రవ్యం వుండటమే యిలా పెరగడానికి కారణమని మనకు బోధపడుతుంది.

ఉదాహరణకు మనదేశంలో రూపాయి ద్రవ్యానికి కొలమానం. రూపాయికి సికరమైన విలువ వుందని అంతా గుర్తించినపుడే ఇతర వస్తువులు యిచ్చి రూపాయి పుచ్చుకుంటారు. రూపాయి విలువ ఎంతనే విషయాన్ని మరో అధ్యాయంలో చర్చించుదాం. ఇచట మనం గమనించవలసిందల్లా పెట్టుబడిగా వినియోగించుతున్న ద్రవ్యం అదనపు ద్రవ్యాన్ని సృష్టించుతోంది. ప్రస్తుత ఆర్థిక విధానం యిలా వున్నంతవరకూ యిది కొనసాగుతూనే వుంటుంది. వస్తూత్పత్తికి, పంపకానికి వినియోగించే ద్రవ్యం మాత్రమే అదనపు ద్రవ్యాన్ని సృష్టించుతోంది. ఇతర పద్ధతుల ద్వారా జరిగే

మార్పిడివల్ల ద్రవ్యం ఒకరి జేబులోనుండి మరొకరి జేబులోకి మారుతుందే గాని వస్తుసంపదను సృష్టించలేదు. అదేవిధంగా అదనపు ద్రవ్యాన్నికూడ సృష్టించలేదు. ఇల్లు ఒక యజమాని చేతుల్లోనుండి మరో యజమాని చేతుల్లోకి మారిందనుకోండి; యజమాని మారాడేగాని పాత యిల్లొకటే వుందిగాని మరొక యిల్లు సృష్టించినట్లు కాదుగదా !

వస్తూత్పత్తి, పంపకాలకు ద్రవ్యం అవసరం. రుణం తీసుకొన్నవాడు తాను లాభం పేరుతో కూడబెట్టిన అదనపు ద్రవ్యంలోనుంచి కొంత భాగాన్ని వడ్డీగా అప్పిచ్చినవానికి యిస్తున్నాడు. అందుచేతనే ధనవంతులు తమవద్ద నిల్వవున్న ద్రవ్యాన్ని వడ్డీకి అప్పుగా యిస్తున్నారు. దీనివల్ల అప్పిచ్చిన ద్రవ్యం వడ్డీతో కలుపుకుని పెరుగుతున్నదని మనం చూస్తున్నాం. "ద్రవ్యం ద్రవ్యాన్ని సృష్టించుతున్న" ట్లు మనకు కన్పించుతుంది. కాని వాస్తవానికి ద్రవ్యం పెట్టుబడిగా మారినపుడు, అనగా వస్తూత్పత్తికీ, పంపకానికీ వినియోగించినపుడు మాత్రమే కొత్త ద్రవ్యం సృష్టించబడుతోంది. వడ్డీమాత్రం అలాంటి కొత్త ద్రవ్యం కాదు. ఉత్పత్తి, పంపకం వల్ల సృష్టింపబడిన అదనపు ద్రవ్యంలోనుంచి చెల్లించబడుతున్న భాగం మాత్రమే వడ్డీ.

# 2. ద్రవ్యం అంటే ఏమిటి?

మొదటి అధ్యాయంలో ద్రవ్యం వివిధ రూపాలను గురించి, దాని ఉపయోగాలను గురించి చర్చించాం. కాని అనేక ముఖ్య ప్రశ్నలకు సమాధానం రాలేదు.

ద్రవ్యం అంటే ఏమిటి? ద్రవ్యానికి స్టాండర్డు కొలమానంగా పరిగణించబడుతున్న రూపాయి అంటే అర్థం ఏమిటి? ఈ ప్రశ్నలకు పర్యవసానంగానే మరొక ప్రశ్న సహజంగా రావచ్చు. ద్రవ్యం అనేది ఎలా వాడుకలోకి వచ్చింది? ద్రవ్యం ఎలా చేయబడింది?

ఆదిమ మానవ సమాజంలో ద్రవ్యం అనే వస్తువే లేదు. వాస్తవానికి ఆరోజుల్లో వస్తువుల మార్పిడియే చాల తక్కువగా జరుగుతుండేది. ప్రతివ్యక్తి లేదా ప్రతి కుటుంబం తమకు అవసరమైన ఆహారం, బట్ట, ఆయుధాలు, గుడిసె తమంతట తామే సంపాదించుకునేవారు. మానవ సమాజం కొంత అభివృద్ధిచెందిన తర్వాతనే వృత్తివిభజన జరిగింది. వేర్వేరు పనులుచేయడంలో, వేర్వేరు వస్తువులను తయారుచేయడంలో కొందరు ప్రత్యేక నైపుణ్యం సంపాదించారు. కొందరు చాపలు అల్లగలుగుతూంటే మరికొందరు గొడుగులు కుట్టగలిగినవారున్నారనుకొందాం. అలాంటపుడు చాపలల్లేవారికి గొడుగులు కావలసివస్తే, గొడుగులు కుట్టేవారికి చాపలు అవసరమైతే గొడుగులను చాపలను పరస్పరం మార్చుకునేవారు. దీనినే బార్టరు పద్ధతిలో మార్పిడి అంటారు. కొందరి

వద్ద తాము తయారుచేసిన వస్తువులు తమ అవసరాలకంటే ఎక్కువగా వున్నప్పుడు, ఇతరులవద్ద తమ కవసరమైన వస్తువులు ఉన్నపుడు ఉభయులమధ్య ఇలాంటి మార్పు జరుగుతుంది. ఆరంభంలో వస్తు మార్పిడి ఈ పద్ధతిలోనే జరిగివుంటుంది.

బళ్లో చదువుకునే ఒక బాలునివద్ద రెండు బలపాలున్నాయి. మరో బాలునివద్ద మిఠాయి వుంది. మొదటివానికి మిఠాయి తిందామనిపించితే, రెండోవానికి బలపం అవసరం వుంది. తన మిఠాయిలో కొంత యిచ్చి బలపం పుచ్చుకోవడం సహజమే గదా! మొదట్లో జరిగిన వస్తు మార్పిడి కూడ యిలాంటిదే కావచ్చు. మిఠాయి ఖరీదెంత? బలపం ఖరీదెంత? అనే ఆలోచన లేకుండానే మార్పిడి (బార్టర్) జరిగి వుంటుంది. ఏమంటే ఆబాలురకు ధరల వ్యత్యాసం గురించి ఆలోచించేకంటే తమ అవసరాలను తీర్చుకోవడమే ప్రధానంగా కన్పించివుంటుంది.

కాని క్రమంగా వస్తు మార్పిడి విరివిగా సాగడం ప్రారంభమయ్యాక, నిత్యావసరంగా మారినతర్వాత మార్చుకునే వస్తువుల విలువను కట్టడం అవసరమయింది. ఒకగొడుగు ఒక చాపతో సమానమా? లేక రెండు చాపలు ఒక గొడుగుతో సమానమా? అనే ప్రశ్నను పరిష్కరించుకోవలసి వచ్చింది.

ఉదాహరణకు గజం గుడ్డను గాని లేక రెండుశేర్ల బియ్యాన్ని గాని రూపాయి ధరకు కొనగలిగినపుడే మనం ఆ రెండిటి ధర ఒకటే అనుకుంటాం. పరస్పరం మార్చుకోడా

నికి కూడ అంగీకరించుతాం. కాని బార్టరు పద్ధతి పూర్తిగా అమల్లోవున్న రోజుల్లో రెండు వస్తువులకు విలువ కట్టడానికి అవసరమైన ద్రవ్యం లేదు. వస్తువుల మార్పిడికి అవసరమైన కొలమానం తయారుకాలేదు.

అందుచేతనే ప్రాచీన సమాజానికి చెందిన స్వయం పోషకంగావుండే గ్రామాలలో వివిధ వృత్తులవారి మధ్య సంప్రదాయ సిద్ధమైన వస్తుమార్పిడి పద్ధతి వుండేది. కుమ్మరి కుండలు తయారుచేసి సంవత్సరం పొడుగునా యిచ్చినందుకు వ్యవసాయదారులు ఒక్కొక బస్తాధాన్యం యిచ్చేవారు. అలాగే వడ్రంగి, కమ్మరి వగైరా వృత్తులవారికి కూడ మిరాశీ లుండేవి. అలావచ్చిన ధాన్యంతో చేతివృత్తులవారి కుటుంబ పోషణ జరిగేది.

ఐతే వస్తువుల విలువకట్టడం ఎలా ప్రారంభమయింది? అనే ప్రశ్న వుంది. ఉదాహరణకు నూలువడికి, గంజిపెట్టి, పడుగుచేసి, నేతనేసిన సాలెవానికి గజం గుడ్డ తయారుచేయ డానికి 12 గంటలు కాలం పట్టిందనుకుందాం. 12 గంటల శ్రమను గజం గుడ్డ విలువగా అతడు ఎంచడం సహజమే గదా! దున్ని, విత్తనాలువేసి, కలుపుతీసి, పండించిన రైతుకు రెండు శేర్ల ధాన్యం పండించడానికి 12 గంటల కాలం పట్టిం దనుకుందాం. అలాంటపుడు రెండు శేర్ల ధాన్యం విలువ 12 గంటల శ్రమశక్తిగా రైతు ఎంచుతాడు. సాలె తాను గజం గుడ్డను తయారుచేయడానికి ఎన్ని గంటల శ్రమ పడ్డాడో, అంత శ్రమపడి పండించిన ధాన్యం పుచ్చుకోడానికి మాత్రమే అంగీకరించుతాడు. గజం గుడ్డకు శేరు ధాన్యం మాత్రమే

రైతు యిస్తానంటే మార్పిడిక సాలె అంగీకరించడు. 4 శేర్లకు గజం గుడ్డ మాత్రమే సాలె యిస్తానంటే రైతు అంగీకరించడు. సాలె పంట పండించడానికి, రైతు బట్ట నేయడానికి ఉపక్రమించుతారే గాని తామెక్కువ శ్రమపడి తయారుచేసిన వస్తువును తక్కువ శ్రమతో తయారైన వస్తువుతో మార్పిడి చేయడానికి ఎవరూ ఒప్పుకోరు. అందుచేత వివిధ వస్తువుల విలువ అవి తయారుచేసేందుకు పడిన శ్రమను బట్టియే మొదట్లో నిర్ణయించాయి.

మానవసమాజ ప్రారంభంలో వలే అందరూ అన్ని పనులూ చేస్తూంటే ఎవరికీ ఏవృత్తిలోనూ ప్రావీణ్యత వచ్చేది కాదు. వృత్తి విభజన జరిగిన తర్వాతనే నైపుణ్యాం పెరిగింది. వేర్వేరు వృత్తులవారు తయారుచేసిన వస్తువులను పరస్పరం మార్చుకోవడం అవసరమయింది. మార్పిడి న్యాయంగా జరగాలంటే వివిధవస్తువులకు విలువకట్టాలిసి వచ్చింది. ఆయా వస్తువులను తయారుచేయడానికి పడిన శ్రమను కొలమానంగా తీసికొని, ఆ యా వస్తువుల విలువను నిర్ణయించడం న్యాయబద్ధంగా కన్పించింది.

మానవ సమాజం మరికొంత అభివృద్ధిజెందిన తరువాత వివిధ తెగలమధ్య వస్తు మార్పిడి అవసరమయింది. ఈ విధంగా విస్తృతం చెందిన వర్తకాన్ని సాగించే ప్రత్యేకవర్గం ఒకటి తయారయింది. ఈ వర్తకులు వస్తువుల విలువను నిర్ణయించడంలో ప్రత్యేక నైపుణ్యాం సంపాదించారు. ప్రతి వస్తువును తయారు చేయడానికి ఎన్నిగంటల శ్రమ అవసరమయిందా అని గాక ఆరకం వస్తువులను తయారుచేయడానికి

తమ పట్టణంలో లేదా దేశంలో ఎంతమంది మనుషులు ఎంత కాలం శ్రమపడుతున్నారో ఎన్ని వస్తువులు తయారుచేస్తున్నారో, ఒక్కొక్క వస్తువులో సగటున ఎంత శ్రమశక్తి యిమిడి వుందో అంచనావేసేవారు. ఆ వస్తువులను మారకం చేసేందుకు తీసుకువెళ్ళిన వర్తకుడు ప్రతి వస్తువులోను యిమిడి వున్న సగటు శ్రమశక్తిని దృష్టిలో వుంచుకునేవాడు. వాటిని ఇతరులకు మారకం యిచ్చి, బదలాగా తాను పుచ్చుకునే వస్తువులలో యిమిడివున్న శ్రమశక్తికూడ తానిచ్చే వస్తువుల లోని శ్రమశక్తికి సాటివస్తుందో లేదో సరిచూసుకునేవాడు. ఇలా జాగ్రత్తగా బేరంచేసి, ఇతర ప్రాంతాలనుండి తమ ప్రాంతానికి అవసరమైన వస్తువులను వర్తకుడు తీసుకువచ్చేవాడు. ఈవిధంగా ఒక పట్టణాన్నుంచి మరొకపట్టణానికి, ఒక దేశాన్నుంచి మరొక దేశానికి వర్తకం క్రమంగా విస్తరించ సాగింది.

లోహాలను కనిపెట్టి, వాటిని కరిగించి పోతపోయడాన్ని మానవులు నేర్చుకున్నతరువాత లోహాలను కూడ పైవిధంగానే మారకం వేసుకునేవారు. 100 తులాల బరువుగల వెండి లోహాన్ని తయారుజేయాలంటే, ముడి ఖనిజాన్ని త్రవ్వడానికి, కరిగించి శుభ్రపరచడానికి ఎన్ని గంటలు శ్రమపడాలో పరిశీలించి, తదనుగుణ్యంగానే తులం వెండి విలువను నిర్ణయించేవారు. చాల అరుదుగా దొరికేవి, అందంగా వుండి చాలా కాలం మన్నికగా వుండే లోహాలను గొప్పగా ఎంచేవారు. వెండి, బంగారు అలాంటి విలువైన లోహాలని ప్రతివారు గుర్తించారు. మారకపు సాధనంగా వాడుకునేందుకు అవసర

మైనంతగా వెండి, బంగారాలు లభ్యం అయ్యేవి. అందుచేత వాటిని సేకరించి, శుభ్రపరచి, పోతపోయడానికి పడే శ్రమను అనుసరించియే వెండి, బంగారాల విలువను కూడ నిర్ణయించారు. అంతేగాక ఈ లోహాలను మారకపు సాధనంగా వినియోగించుకోడానికి ప్రత్యేక సౌలభ్యం కూడ కన్పించింది. చిన్న పరిమాణంలో వున్నందున ఒకచోట నుంచి మరొక చోటికి తీసుకువెళ్ళడం సులభం. ఒక తులం వెండిలోనూ లేదా ఒక చిన్నం బంగారంలోను ఎన్నో గంటల శ్రమశక్తి ఇమిడివుంది. వస్తువులను మార్పిడి చేయడానికి తీసుకువెళ్ళిన అన్ని పట్టణాలలోను ఈ లోహాల విలువ సర్వసాధారణంగా గుర్తించబడుతోంది. అందుచేత వెండి, బంగారు లోహాలు క్రమంగా మారకపు సాధనాలుగా అత్యంత ప్రాముఖ్యత వహించసాగాయి.

ఈ విధంగా మారకపు సాధనాలు (Medium of exchange) వృద్ధిచెందాయి. వర్తక - వ్యాపారాలలో వెండి - బంగారు లోహాలు ప్రతిచోట మారకపు సాధనాలుగా గుర్తించబడ్డాయి. నగలు, అలంకారాలు ఈ లోహాలతో తయారు చేయవచ్చుననే కారణం వల్ల మాత్రం వెండి, బంగారు లోహాలకు విలువరాలేదు. తన సామానుకు బదులుగా బంగారం లేక వెండి పుచ్చుకున్న వర్తకుడు వాటితో మరే చోటనైనా తనకు అవసరమైన వస్తువులు కొనవచ్చు. మారకపు సాధనాలుగా వెండి, బంగారు లోహాల గుర్తింపు అందువల్లనే సాధ్యమయింది.

మొదట్లో వెండి, బంగారం లోహాలకు తూకం అనుస రించే విలువ నిర్ణయించేవారు. అప్పటికి యింకా నాణాల వాడకం అమల్లోకి రాలేదు. తరువాతనే తులం వెండిని కరి గించి రూపాయి నాణెంగా పోతపోయడం, ఔన్సులో నాలుగోవంతు బంగారాన్ని నవరసుగా పోతపోయడం జరి గింది. నాణాలపై ఆ యా ప్రభుత్వ ముద్రలు అచ్చువేసే వారు. ఇందువల్ల రూపాయి నాణెంలో యింత వెండి వుందనీ, నవరసులో యింత బంగారం వుందనీ వాడకందార్లకు హామీ వుండేది. ఆ యా ప్రభుత్వాల అధికారం చెలామణీ అవు తున్న ప్రాంతా లన్నిటిలోనూ ఆ యా నాణాలు ఎట్టి ఆక్షే పణ, అనుమానం లేకుండా స్వీకరించబడేవి. ఉదాహరణకు రూపాయినాణెం భారత దేశమంతటా చెలామణి అయ్యేది. నవరసు బ్రిటీషు దేశమంతటా చెలామణి అయ్యేది. కాని వేర్వేరు దేశాల మధ్య వస్తువుల మారకం జరుగవలసి వచ్చినపుడల్లా ఆ యా వస్తువుల విలువను బంగారు వెండి లోహాలతో లెక్కగట్టేవారు. ఒక దేశంలో చెలామణి అవు తున్న నాణాలను మరో దేశంలో గుర్తించేవారు కాదు. బంగారం మాత్రమే వివిధ దేశాలమధ్య మారక సాధనంగా చెలామణి అవుతుంది.

ఈ సందర్భంలో మనమంతా దృష్టిలో వుంచుకోవాలసిన ముఖ్యవిషయం ఒకటుంది. బంగారం, వెండి లోహాల విలువ కూడ తక్కిన అన్ని వస్తువుల మాదిరిగానే అవి తయారు చేయ డానికి వినియోగించిన శ్రమ గంటల ప్రాతిపదికపైనే నిర్ణ యించేవారు. గజం గుడ్డను రెండు శేర్ల ధాన్యంతో మార్పిడి

చేసుకోడానికి కారణం వాటిని తయారుచేసేందుకు పడిన శ్రమ సమాన మవడమేనని యిదివరకు చెప్పుకొన్నాము. అదే విధంగా వెండి, బంగారాలు కూడ అవి తయారుచేయడానికి ఎన్ని గంటల శ్రమశక్తి ఖర్చుఅయిందో ఆ ప్రాతిపదికపైనే విలువ కట్టబడుతున్నాయి. ఆ ప్రాతిపదికపైనే వెండి, బంగారు లోహాలు మారకపు సాధనాలుగా వినియోగించుతున్నాయి. ఆ ప్రాతిపదికపైనే ఇతర వస్తువులన్నిటినీ వెండి, బంగారు లోహాలతో మార్పిడి చేసుకోవడం జరుగుతోంది.

ఐతే ప్రతి వర్తకుడు తాను ద్రవ్యమిచ్చి వస్తువులను కొనేటపుడు తానిచ్చే ప్రతి రూపాయిలోనూ ఇన్ని గంటల శ్రమశక్తి ఇమిడి వుందని అర్థంచేసుకున్నాడని చెప్పలేము. కాని తరతరాలుగా వస్తున్న అనుభవం ద్వారా వర్తకుడు తానిచ్చే రూపాయలవిలువ, తాను కొనే వస్తువుల విలువతో సమానమని అవగాహన చేసికోగలడు. అలాంటపుడే బేరం కుదుర్చుకుంటాడు. ప్రతి వస్తువు ధర ఇన్ని రూపాయలని అతడర్థం చేసుకోగలడు. కాని రూపాయి నాణెంలో ఇన్ని గంటల శ్రమశక్తి ఇమిడి వుందనే సంగతి అంతకు పూర్వమే నిర్ణయమైపోయింది. ఆ ప్రాతిపదికపైనే వెండి బంగారు లోహాలు, రూపాయి, నవరసు నాణాలు మారకపు సాధనాలుగా తరతరాలుగా చెలామణి అవుతున్నాయి. ప్రతి మనిషి తామిచ్చే ద్రవ్యానికి బదులు మారకం పుచ్చుకునే వస్తువులను సాధ్యమైనన్ని ఎక్కువగా రాబట్టుకోడానికి సహజంగా ప్రయత్నించుతాడు.

వెండి, బంగారు లోహాలను ప్రభుత్వ ముద్రవేసిన నాణాలుగా తయారుచేయడంతో చిత్రమైన మార్పువచ్చింది. మారకపు సాధనంగా ద్రవ్యమనేది అవతరించింది. అంతవరకు దాకా వెండి, బంగారాలను తూకంవేసి, ఇతర వస్తువులతో మారకం వేసికొన్నంతవరకు యిది సంభవించలేదు. తక్కిన వస్తువులను బార్టరు పద్ధతిలో మారకం వేసికొన్నట్లుగానే వెండి, బంగారు లోహాలను కూడ రూపాయిలు, నవరసులుగా పోతపోసి, ప్రభుత్వముద్ర వేయడంతో, ఈ నాణాలు స్టాండర్డు కొలమానం రూపం ధరించాయి. తక్కిన వస్తుసముదాయాన్నంతటినీ ఈనాణాల కొలతతో ధరకట్టడం ప్రారంభమయింది. బార్టరు పద్ధతిలో వస్తువులను మార్చుకోడమనేది మరుగున పడి, ప్రతి వస్తువు ధర ఇన్నిరూపాయలు అని నిర్ణయించడం జరుగుతోంది. గజం గుడ్డ ధర రూపాయి; రెండు శేర్ల ధాన్యం ధర రూపాయి; అని వ్యవహారించడం ప్రారంభమయింది.

నవరసుపై చక్రవర్తి లేక రాణీ బొమ్మ వున్నా లేక రూపాయిపై సింహతలాటం అశోక చక్రం వున్నా, వాటిని బంగారం వెండి లోహాలతో తయారు చేసినంతకాలం వాటిలో యిమిడి వున్న శ్రమశక్తియే వాటి విలువకు ప్రాతిపదికగా వుండేది. తులం వెండికి ప్రభుత్వ ముద్రవేసి, రూపాయని పేరు పెట్టడంతోనే దాని కొక ప్రత్యేకత, విచిత్ర శక్తి (Mystical energy) వచ్చింది. వస్తువులను మారకం వేసుకునే బార్టర్ పద్ధతిని గురించిన ఆలోచనలు ప్రజల మనస్సుల నుండి వెనకబడ్డాయి. క్రయ విక్రయాలను గురించిన నూతన ఆలోచనా ధోరణి ప్రారంభమయింది. ఫలానా వస్తువు ధర

ఇన్ని రూపాయలని భావించసాగారు. అన్ని వస్తువుల ధరను కొలిచేందుకు రూపాయి నాణెం ప్రత్యేక సాధనంగా రూపొందింది.

తరువాత కర్రెన్సీ నోట్లు రంగంలో ప్రవేశించాయి. ప్రభుత్వం తరఫున రిజర్వు బ్యాంకులో వెండి, బంగారు లోహాలను హామీగా వుంచి, వాటికి బదులు కర్రెన్సీనోట్లు అచ్చు వేయడమనేది ప్రారంభమయింది. రూపాయి నోటుకు రూపాయి నాణెం లేక తులం వెండి యిస్తారనీ, పదిరూపాయల నోటుకు పది తులాల వెండి యిస్తారనీ మన దేశంలో హామీ వున్నందునే మొదట్లో కర్రెన్సీ నోట్లు చెలామణి అయ్యేవి. అలాగే ఇంగ్లండులో ఒక పౌను నోటుకు నవరసు గాని ఔన్సులో నాల్గోవంతు బంగారం గాని యిస్తారనే నమ్మకంతోనే మొదట్లో పౌన్లు నోట్లు చెలామణి అయ్యేవి. గోల్డ్ స్టాండర్డ్ (బంగారు ప్రమాణం) అని దీన్నే పిలిచేవారు. మన దేశంలో కర్రెన్సీ నోట్లకు వెండిరూపాయలిస్తారనే హామీ యుద్ధానికి పూర్వం వరకు వుండేది. తరువాత ఇంగ్లాండులో బంగారు ప్రమాణం ఎత్తివేసేవారు. మన దేశంలో కూడ యుద్ధకాలంలో వెండిరూపాయలు పోయి, నికిల్ రూపాయలు అమల్లోకి వచ్చాయి.

ఎంత చిత్రమైన మార్పో చూడండి. ఇపుడు రూపాయి నాణెంలో తులం వెండి లేదు. కర్రెన్సీ నోట్లకు వెండి లోహం యిస్తామనే ప్రభుత్వ హామీకూడ లేదు. మార్కెటులో అన్ని వస్తువులవలెనే డబ్బిచ్చి వెండి కొనవచ్చును. ప్రస్తుత మార్కెటు రేటు ప్రకారం తులం వెండికి రూపాయి ముప్పా

వులా ధర చెల్లించవలసి వస్తుంది. అలాగే ఇంగ్లండులో నవ రసు బంగారాన్ని ప్రస్తుతం మార్కెట్టులో సుమారు 3 పౌన్లకు పైగా ధర చెల్లించితే కొనవచ్చు.

వెండి, బంగారు లోహాలు మారకపు సాధనంగా రూపొందిన తర్వాత వర్తకానికి ఎంతో సౌలభ్యం ఏర్పడింది. వివిధ దేశాలమధ్య వ్యాపారం విస్తృతమయింది. ప్రపంచం లోని అన్ని వస్తువుల ధరలను వెండి బంగారు లోహాలతో పోల్చి ధర కట్టడం ముఖ్యంగా బంగారంతో పోల్చి ధరకట్టడం సర్వవ్యాపితమయింది. ఒకరకం వస్తువులను సంపాదించాలంటే ఆ స్వంతదారు ఏ రకం వస్తువులతో మారకం వేసికుంటాడో చర్చించవలసిన అవసరం లేదు. కొనేవాడు బంగారంగాని వెండిగాని యిస్తే వాలు; ఆ వస్తువులను సంపాదించగలుగు తాడు. ఆ స్వంతదారు తనకు లభించిన వెండి లేక బంగా రంతో తనకు అవసరమైన వస్తువులను సులభంగా కొనగలుగు తాడు. వెండి, బంగారు లోహాలకు ప్రభుత్వముద్ర వేసి, నాణాలను తయారుచేశాక వ్యాపారం మరింత సులభమయింది. ప్రతి వస్తువుధర ఇన్నిరూపాయలని నిర్ణయించడం అలవడింది. ఒకపుడు మారకపు విలువగా ఎంచబడినది క్రమంగా మారి ఆ వస్తువుయొక్క ధరగా (వెలగా) చెప్పడం సర్వసాధారణమై పోయింది.

ఐనప్పటికి మారకానికి ప్రాతిపదిక ఎప్పటివలెనేవుంది. ఒక వస్తువును తయారు చేయడానికి సగటున ఎన్నిగంటల మానవుని శ్రమశక్తి అవసరమయిందో దానికి సమానమైన వెండి లేక బంగారు నాణాలలో ఆ వస్తువుయొక్క ధర నిర్ణ

యించడం పరిపాటయింది. అందుచేత వస్తువు ధరను సర్వ సాధారణంగా మనం రూపాయిలలో వ్యక్తం చేస్తున్నప్పటికీ, వాస్తవానికి ఎన్ని గంటల మానవుని సగటు శ్రమశక్తి ఆ వస్తువును తయారు చేయడానికి అవసరమో ఆ ద్రవ్యం తెలుపుతుందని చెప్పవచ్చు. క్లుప్తంగా చెప్పాలంటే మానవుని శ్రమశక్తి విలువను బట్టే వస్తువుయొక్క ధరను (వెలను) మనం నిర్ణయించుతున్నామనవచ్చును.

బార్టరు పద్ధతిలో వస్తువులను మారకం వేసుకునేటప్పుడు శ్రమశక్తే ప్రాతిపదికగా వుండేది. వెండి బంగారు లోహాలను మారకపు సాధనంగా వినియోగించేటప్పుడు కూడ శ్రమశక్తే ప్రాతిపదికగా వుండేది. బంగారు నాణాలను లేక వెండి రూపాయలను మారకపు సాధనంగా వినియోగించేటప్పుడు కూడ శ్రమశక్తే ప్రాతిపదికగా వుండేది. బంగారు పరిమాణం (గోల్డ్ స్టాండర్డ్) వదలివేశాక, వెండి రూపాయికి బదులు నికెల్ రూపాయి వచ్చాక, అలాగే కరెన్సీ నోట్లు (కాగితం రూపాయిలు) వచ్చిన తర్వాతకూడ ఆ యా వస్తువుల ధరలను నిర్ణయించడంలో ఆ యా వస్తువులలో ఇమిడి వున్న శ్రమశక్తియే ప్రాతిపదికగా వుంటూంది.

అందుచేత మానవుడు తాను తయారుచేసిన వస్తువులను ద్రవ్యానికి అమ్ముతున్నాడంటే, తాను ఎంత శ్రమశక్తి వినియోగించాడో అంత శ్రమశక్తితో తయారైన వస్తువులను ఆ ద్రవ్యంతో కొనే హక్కును సంపాదించుతున్నాడని అర్థం.

సమాజం అభివృద్ధి చెందినకొలదీ, వ్యాపారం విస్తృత మైన కొలదీ, వస్తువుల క్రయ విక్రయాలు సర్వసాధారణమైన కొలదీ మార్కెటులో బేరం చేసిన ప్రతిమనిషీ ఆ యా వస్తువులో ఎన్ని గంటల శ్రమశక్తి ఇమిడివుందని ఆలోచించడం లేదు. ఆచరణలో మచ్చుల దొడ్డిలోనికి అమ్మకానికి వచ్చిన వివిధరకాల సరకును పరిశీలించిన అనుభవశాలులైన వర్తకులు ఆ యా రకం వస్తువుల సగటు ధర నిర్ణయించుతారు. మార్కెటుకు వచ్చిన ప్రతివారు ఆ యా రకం వస్తువుల సగటు ధరను ప్రాతిపదికగా చేసుకొని, ఆ యా వస్తువుల మంచిచెడ్డలను దృష్టిలోవుంచుకొని బేరంచేస్తారు. ఇలాగే మార్కెటులో అమ్మకాలు, కొనడాలు జరుగుతాయి.

ద్రవ్యమనేది చెలామణిలోకి వచ్చాక వస్తువుల మారకం సులభతరమయింది. వివిధరకాల వస్తువుల ధరలను నిర్ణయించడం సులభమయింది. బంగారం విలువైన లోహం కావడంవల్ల అన్ని దేశాలు దానినే ముఖ్య మారక సాధనంగా అంగీకరించుతున్నాయి. ఒకపుడు వెండి లోహాన్నికూడ కొన్ని దేశాలలో గుర్తించినప్పటికి క్రమంగా అంతర్జాతీయ మారకపు సాధనంగా బంగారమొకటే నిలచింది.

ఆధునిక సమాజంలో ఫలానా వస్తువు ధర ఇన్నిగంటల శ్రమ అంటే విచిత్రంగా కన్పించవచ్చు. ఏమంటే ఆ వస్తువును అమ్మే దుకాణదారుకు ఆ వస్తువును తయారు చేయడానికి ఎంత శ్రమ అవసరమయిందో తెలియదు. అలాగే రేడియోలాంటి వస్తువు తయారుచేయడానికి ఎన్ని రకాల ముడిపదార్థాలు కావలసివచ్చాయో, ఎన్ని రూపాంతరాలు

ధరించారో, ఎన్నిగంటల శ్రమతో రేడియో నిర్మించారో సుతరాం అర్థమే కాదు. కాని రేడియో ధర యెంతో సుల భంగా దుకాణదారు చెప్పగలుగుతున్నాడు. అంతేగాదు. రేడియోధర ఒకపుడు హెచ్చుతూ, మరొకపుడు తగ్గుతూ వుంటుంది. ఇలా ధర మారినపుడల్లా రేడియోను తయారు చేసేందుకు అవసరమైన శ్రమశక్తి గంటలు మారాయని వాదించడం కూడ సరికాదు. మానవ శ్రమతో నిమిత్తంలేని వస్తువులను కూడ మార్కెటులో అమ్మడం, కొనడం జరుగు తోంది. ఉదాహరణకు భూమిని కూడ ధరగట్టి అమ్ము తున్నారు.

వాస్తవానికి ధరకు, మారకపు విలువకు మధ్య తేడా వుంది. ఐతే ఆ విషయాన్ని తరువాత చర్చించుదాం. ధరల హెచ్చు తగ్గులకు కారణాలను పరిశీలించినపుడు ఆ సం గతి అవగాహనవుతుంది.

ఇపుడు ద్రవ్యమనేది ఎలా వచ్చింది ? ప్రపంచంలోని ప్రతి వస్తువును కొనగల శక్తి ద్రవ్యానికెలా వచ్చింది ? ద్రవ్యాన్ని ఎలా సృష్టించారు ? అనే విషయాలను ముందుగా పరిశీలించుదాం.

ప్రారంభంలో వెండి, బంగారు లోహాలను మారకపు సాధనంగా - ద్రవ్యంగా - స్వీకరించినపుడు, కేవలం ఆ లోహా లను త్రవ్వి, శుద్ధిచేసినందుకు పడిన శ్రమను వినియోగించిన మానవశ్రమశక్తినే కొలమానంగా పరిగణించేవారు. ప్రభు త్వాధికారంలో వున్న రాజు తన వద్దనున్న బంగారం, వెండి

లోహాలను నిర్ణీతాకం గల నాణాలుగా పోతపోయించి, ప్రభుత్వముద్ర వేయించి ద్రవ్యంగా చెలామణిలో పెట్టాడు. ఆ నాణాలు క్రమంగా వస్తు మారకానికి వినియోగపడుతూ, కొనుగోలుదారు అమ్మకందారు మధ్య అనేకసార్లు చేతులు మారుతూ ద్రవ్యంగా చెలామణి అవుతున్నాయి. ధనవంతులు వెండి బంగారు లోహాలను లేదా నాణాలను నిల్వచేసి, ఆ ద్రవ్యంతో అవసరమైన వస్తువులను కొనగలుగుతున్నారు. ద్రవ్యం చెలామణిలో తిరుగుతున్నా లేదా ఎవరి బొక్కసంలో నైనా నిల్వవున్నా, ప్రతిసంవత్సరం అదనంగా వెండి బంగారు లోహాలను వుత్పత్తి చేయడంవల్లనూ కొత్త నాణాలను అదనంగా ముద్రవేయడం వల్లనూ మొత్తం ద్రవ్యం నానాటికి పెరుగుతూంది.

అదేవిధంగా ఆధునిక సమాజంలో ప్రతి దేశంలోను చెలామణి అవుతున్న ద్రవ్య మొత్తం క్రమంగా పెరుగుతూంది. అలాగే ప్రపంచంలో ద్రవ్యంగా చెలామణి అవుతున్న బంగారం వుత్పత్తి కూడ యేటేటా పెరుగుతూంది. నాణాల మొత్తం కూడ పెరుగుతూంది.

ఈమధ్య కొంతకాలం నుంచి బంగారు, వెండి లోహాలను ప్రతి దేశం కేంద్ర బ్యాంకుల కోశాగారాలలో నిల్వవుంచడం మాత్రమే జరుగుతూంది. వస్తువుల మారకానికి సాధనంగా వినియోగించడం లేదు. నాణాల వాడకం వల్ల క్రమంగా ఒకసంగతి బోధపడింది. నాణాలలో విలువైన లోహం వున్నా లేకపోయినా, శ్రమశక్తి ఇమిడివున్నా లేకపోయినా వస్తువుల మారకానికి రూపాయి నాణాలుగాని

కరెన్సీ నోట్లుగాని వినియోగపడతాయని ఆచరణలో సజు వయింది. కావలసిందల్లాప్రభుత్వ ముద్రా, గ్యారంటీ వుంటే నాణాలు, కరెన్సీ నోట్లు వగైరా వస్తు మార్పిడికి వినియోగ పడుతున్నాయి. వాటికివస్తుతః విలువ లేక పోయినప్పటికీ, వెండి బంగారు లోహాలకు చిహ్నంగా కరెన్సీనోట్లు ద్రవ్యంగా చెలామణి అవుతున్నాయి.

అంతేకాదు, బ్యాంకు చెక్కులు, డ్రాఫ్టులు వగైరా కూడ మారక సాధనాలుగా వినియోగించుతున్నాయి. అంతే ఆస్తిపాస్తులకు చిహ్నంగా రిజిస్టర్డ డాక్యుమెంటులు వుంటు న్నట్లుగానే శ్రమశక్తికి చిహ్నంగా ద్రవ్యం వుంటూందని చెప్పవచ్చు.

బ్యాంకులలో ఖాతాలు పెట్టుకొని, చెక్కులు, డ్రాఫ్టుల ద్వారా వర్తక వ్యాపారాలు చేయడం ప్రారంభ మయ్యాక ద్రవ్య చెలామణికి పరిమితులంటూ లేకుండా పోయింది. గతంలో బంగారు వెండి లోహాల పరిమితికి నాణాల పరిమితికి అనుగుణంగానే ద్రవ్య చెలామణి జరిగేది. ఇపుడు దేశంలో గాని, ప్రపంచంలోగాని వున్న వెండి బంగా రాల పరిమితితో నిమిత్తం లేకుండా ద్రవ్యం చెలామణి అవు తోంది. బ్యాంకులలో నిల్వవున్న మూల ధనానికి మించి అనేక రెట్లు ద్రవ్యాన్ని సృష్టించ గలుగుతున్నారు. ఖాతా దార్ల అవసరాలకుచెక్కులు, డ్రాఫ్టులు యిస్తున్నారు. ఈవి ధంగా ద్రవ్యంఎంతో చెలామణి అవుతోంది.

అలాగే ప్రభుత్వం కూడ కర్రెన్సీ నోట్లను అచ్చువేయడం ద్వారా, నికిల్ రూపాయి నాణాలను ముద్ర వేయడం ద్వారా ద్రవ్యాన్ని సృష్టించుతోంది. ఉదాహరణకు ఇండియాప్రభుత్వం తరఫున రిజర్వు బ్యాంకు కర్రెన్సీ నోట్లను అచ్చువేస్తోంది. రిజర్వు బ్యాంకులో హామీగా వుంచిన బంగారు నిల్వలకు ఎన్నోరెట్లు కర్రెన్సీనోట్ల రూపంలో ద్రవ్యాన్ని సృష్టించుతోంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అవసరాలకోసం ఈవిధంగా 1500 కోట్ల రూపాయల కర్రెన్సీని అచ్చువేయాలని ఇండియా ప్రభుత్వం నిర్ణయించినట్లు మన కందరికీ తెలుసు. ఇలా చేయడం నిజంగా ద్రవ్యాన్ని సృష్టించడమేగదా!

ద్రవ్యం ఎచటనుండి వస్తూంది? అనే ప్రశ్నకు మన మింకా పూర్తి సమాధానం యివ్వలేదు. చెలామణిలోవున్న వెండి బంగారు లోహాలు, నాణాలు, కర్రెన్సీ నోట్లు, బ్యాంకు చెక్కులు వగైరా అన్నీగాక మరెంతో ద్రవ్యం అదనంగా చెలామణి అవుతోంది. ప్రపంచంలో చెలామణి అవుతున్న ద్రవ్యం అంతటికి మూలం ఏదో ఖచ్చితంగా చెప్పడం సంభవం కాదు. ఐతే పెట్టుబడిగా వినియోగించిన ద్రవ్యం ఏవిధంగా అదనపు ద్రవ్యాన్ని సృష్టించుతూందో మొదటి అధ్యాయంలో వివరించాం. ప్రపంచమందలి ద్రవ్యం క్రమంగా పెరగడానికి మూలకారణ మదే.

ప్రపంచంలోని ద్రవ్యంలో కొంతభాగం పెట్టుబడిగా వినియోగించుతోందని యిదివరకే చూశాము. స్థలానికి, కట్టడాలకు, యంత్రాలకు, ముడిపదార్థాలు, బొగ్గు కొనడా

నికి, కార్మికుల వేతనాలు చెల్లించడానికి పెట్టుబడిగా పెట్టిన ద్రవ్యం వినియోగపడుతూంది. ఇలా ఖర్చుపెట్టిన మొత్తం ద్రవ్యానికంటే, తయారైన వస్తువులను అమ్మగా ఎక్కువ ద్రవ్యం వస్తూంది. ఇలా అదనంగా వచ్చేదానిలో యంత్రాలు వగైరా అరుగుదలా వగైరా మినహాయించగా మిగిలేదానిని లాభమని పిలుస్తున్నాం. ఈవిధంగా పెట్టుబడి పెట్టిన యజమాని గాని కంపెనీగాని అదనంగా సృష్టించబడిన ద్రవ్యానికి, లేదా లాభానికి హక్కుదారవుతున్నారు. ఐతే ఈ కొత్త ద్రవ్యం ఎలా సృష్టించబడుతున్నదనేదే ప్రశ్న.

ఇన్ని గంటల శ్రమకు చిహ్నంగా రూపాయి తయారయిందని మనం గమనించాం. చేతిలో రూపాయలున్నవాడు వాటిని మారకం వేసి, ఇతర వస్తువులను సంపాదించగలడని మనకు తెలుసు. ఫ్యాక్టరీ యజమాని సరకులను తయారు చేయించి, అమ్మడం ద్వారా తాను చేసిన ఖర్చు మొత్తం కంటే అదనపు ద్రవ్యం చేకూర్చగలుగుతున్నాడనికూడ అర్థం చేసుకున్నాం. అతడు సంపాదించిన లాభం లేదా సృష్టించిన అదనపు ద్రవ్యం ఫలితంగా తాను పెట్టుబడి పెట్టినదానికంటే ఎక్కువ గంటల శ్రమకు - లేదా ఎక్కువ ద్రవ్యానికి - అధినాథుడయ్యాడని తేలుతుంది.

ఫ్యాక్టరీ యజమాని ఖర్చుచేసే ద్రవ్యంలో ఒక భాగాన్ని కార్మికుల శ్రమశక్తిని కొనడానికి అతడు వినియోగించుతున్నాడు. ఒక యజమాని వేతనాలిచ్చి కార్మికుల

చేత 48 గంటలు పనిచేయించుకున్నాడనుకుందాం. తయారైన వస్తువులను అమ్మడం ద్వారా యజమానికి లాభం వస్తున్నదనే సంగతి నిర్వివాదం. ఫ్యాక్టరీలో పనిచేస్తున్న కార్మికులు సరుకును ఉత్పత్తిచేయడం ద్వారా సృష్టించిన అదనపు ద్రవ్యం యజమానికి దఖలుపడుతోంది.

కాని 48 గంటలు పనిచేసిన కార్మికులకు ఏమి వేతనం ముడుతోంది? కార్మికులు తమ జీవితాన్ని, కుటుంబాన్ని పోషించడానికి అవసరమైన కనీస వేతనం మాత్రమే యజమాని కార్మికులకు యిస్తున్నాడు. కార్మికుల కుటుంబాలకు కావలసిన ఆహారం, బట్టలు, తలదాచుకునేందుకు యిల్లు వగైరా కనీస జీవితావసరాలకు మాత్రమే, అనగా కొన్ని గంటల శ్రమకు తగిన వేతనాలను మాత్రమే యజమాని కార్మికుల కిస్తున్నాడు.

ఎన్ని గంటల శ్రమకు సరియైన విలువ యిస్తున్నాడు? అనే విషయం జాగ్రత్తగా పరిశీలించాలి. మానవ శ్రమశక్తికి చిహ్నంగా మాత్రమే ద్రవ్యం వుందనీ, రూపాయి కొన్ని గంటల శ్రమకు చిహ్నంగా వుందనీ మనం గుర్తించుతున్నాం. వారంలో కార్మికుడు 48 గంటలు శ్రమపడిన ఫలితంగా 10 రూపాయల విలువచేసే అదనపు సరుకు ఉత్పత్తి జరిగిందనుకుందాం. యజమాని అందులోనుంచి 5 రూపాయలు మాత్రమే కార్మికునికి వారానికి సగటు వేతనంగా యిస్తు

న్నాడు. తక్కిన 5 రూపాయలను యజమాని తన లాభంగా తీసుకుంటున్నాడు. అనగా కార్మికుడు పనిచేసిన 48 గంటలలో 24 గంటలు మాత్రమే తనకొరకు పనిచేస్తున్నాడు. తక్కిన 24 గంటల శ్రమ ఫలితం యజమానికి దక్కుతోంది.

పెట్టుబడిదారీ విధానం క్రింద నిత్యం కార్మికులు శ్రమ పడుతున్నారు. వారి కనీస జీవితావసరాలు తీరేందుకు మాత్రమే వేతనాలిస్తూ, కార్మికుల శ్రమ ఫలితంలో కొంత భాగాన్ని లాభంపేరుతో యజమాని దఖలుపరచుకుంటున్నాడు.

వ్యక్తులు, కంపెనీలు తమపేర ఖాతాలుపెట్టి బ్యాంకులలో ద్రవ్యం నిల్వచేస్తుంటారు. ఫ్యాక్టరీ నిర్వహణ నిమిత్తం అనగా ముడిపదార్థాలు కొనేందుకు, వేతనాలు చెల్లించేటందుకు బ్యాంకులనుండి ద్రవ్యం తీస్తుంటారు. కొత్తగా తయారైన సరుకులను అమ్మి, తీసుకున్నదానికంటే హెచ్చు ద్రవ్యాన్ని తిరిగి బ్యాంకులో వేస్తుంటారు. లాభాల పేరుతో అదనపు ద్రవ్యం చేరుతూండటంవల్ల యజమాని పేరుతో బ్యాంకులోవున్న జమ ఖాతా క్రమంగా పెరుగుతుంటుంది.

ఐతే కొన్ని సమయాలలో తయారైన సరుకులు అమ్ముడుగాకపోవచ్చు. అపుడు ఆర్థిక మాంద్యం ఏర్పడిందంటాం. తయారైన వస్తువులను కొనేందుకు ప్రజలవద్ద తగినంత ద్రవ్యం వుండకపోవడమే ఇందుకు కారణం. ప్రజల కొనుగోలు శక్తి పడిపోయిందని కూడ దీన్నే అంటాము.

కిందటిసారి తయారైన వస్తువులు ఖర్చు కానపుడు యజమాని తనవద్ద ద్రవ్య మున్నాసరే, ముడిపదార్థాలు కొని ఉత్పత్తిని కొనసాగించడానికి ఇష్టపడడు. ఏమంటే ఉత్పత్తిని కొనసాగించడం వల్ల లాభం రాకపోగా నష్టం వస్తుంది. నిల్వ వున్న సరుకులను ఖర్చుపెట్టిన దానికంటే తక్కువ ధరకు విడుదల చేయవలసివస్తుంది. బ్యాంకునుంచి తీసుకున్నద్రవ్యంకంటే తక్కువ ద్రవ్యాన్ని మాత్రమే బ్యాంకులో జమ కట్టగలుగుతాడు.

వీటన్నిటినీ గమనించినపుడు వస్తువుల విలువకు, ధరకు వున్న సంబంధం ఏమిటనే ? ప్రశ్న వుదయించుతుంది. ఆ విషయాన్ని గురించి ఐదవ అధ్యాయంలో పరిశీలించుదాం.

——:x:——

## 3. వివిధ దేశాల కర్రెన్సీలు: మారకం చిక్కులు

భారత దేశంలో ద్రవ్యానికి కొలమానం (స్టాండర్డు యూనిట్) రూపాయని మనమంతా ఎరుగుదుం. మన కర్రెన్సీ రూపాయల్లో వుంది. వివిధ వస్తువుల మార్పిడి, అమ్మకం కొనుగోలు వ్యాపారమంతా రూపాయల్లోనే జరుగుతోంది. మనదేశంలో అంతర్గతంగా జరుగుతూన్న ఎకౌంటింగ్ అంతా రూపాయల్లోనే జరుగుతోంది.

కాని వేర్వేరు కర్రెన్సీలు కలిగిన వివిధదేశాల మధ్య కూడ అమ్మకం, కొనుగోలు వ్యాపారం జరుగుతున్నది. మన దేశంలో ద్రవ్యానికి రూపాయి కొలమానంగా వున్నట్లే, బ్రిటనులో పౌను, అమెరికాలో డాలరు, ఫ్రాంసులో ఫ్రాంకు, సోవియట్ యూనియన్‌లో రూబులు, చైనా ప్రజారిపబ్లిక్‌లో యువాన్ వగైరా కొలమానాలుగా వుంటున్నాయి. అలాంటపుడు వివిధదేశాల మధ్య వస్తువుల మార్పిడి ఎలా జరుగుతున్నది? వివిధదేశాల మధ్య క్రయ విక్రయాలు, ఎకౌంటింగు ఆర్థిక లావాదేవీలు అన్నీ ఎలాసాగుతున్నాయి? అనే ప్రశ్నలు సహజంగా వస్తాయి.

మనదేశం నుంచి మాంగనీస్ ముడిపదార్థాన్ని అమెరికాకు అమ్ముతున్నాం. అమెరికానుండి మోటారు కార్లు, ఫిల్ములు వగైరా దిగుమతి చేసుకుంటున్నాం. మాంగనీస్ అమ్ముతున్న భారతదేశ వర్తకుడికి అమెరికా వర్తకుడు రూపాయలు చెల్లించాలి. మోటారు కార్లు పంపుతున్న

అమెరికన్ వర్తకునికి మనం డాలర్లు చెల్లించాలి. అందుచేత రూపాయలు – డాలర్లు మధ్య "మారకపు రేటు" అవసరమౌతూంది.

ప్రస్తుత మారకపు రేటు ప్రకారం నాలుగు రూపాయల 76 నయాపైసలు ఒక అమెరికన్ డాలర్‌తో సమానం. అనగా లక్షడాలర్ల విలువగల అమెరికన్ కార్లను దిగుమతి చేసుకుంటే ఇండియా వర్తకుడు 4 లక్షల 76 వేల రూపాయలు చెల్లించవలసి వుంటుంది. కాని అమెరికా వర్తకుడు మన రూపాయలు పుచ్చుకోడు; డాలర్లే కావాలంటాడు. భారత దేశ వర్తకునివద్ద డాలర్లు లేవు. అందుచేత అతడు చెల్లించే 4 లక్షల 76 వేల రూపాయలను స్వీకరించి, ప్రత్యామ్నాయంగా అమెరికా వర్తకునికి లక్ష డాలర్లు చెల్లించేందుకు భారత ప్రభుత్వం ఏర్పాటుచేయవలసి వుంటుంది. లేదా లక్ష డాలర్ల విలువచేసే బంగారాన్ని యిచ్చుకోవలసి వుంటుంది.

అమెరికా నుండి కార్లుమాత్రమే గాక ముడిఫిల్ములు, యంత్రాలు వగైరా అనేకరకాల సరుకులను భారతదేశం కొంటూంది. అలాగే భారతదేశాన్నుండి మాంగనీస్ మాత్రమేగాక మిరియాలు, జీడిపప్పు, లక్క వగైరా అనేక రకాల సరుకులను అమెరికా కొంటూంది. ఈ లావాదేవీలన్నిటిని సరిపుచ్చడానికి మారకపు బ్యాంకులు (ఎక్స్చేంజి బ్యాంకులు) వున్నాయి. భారదేశ వర్తకులు తాము దిగుమతి చేసుకున్న అమెరికన్ సరకుల నిమిత్తం చెల్లించాలిసిన ద్రవ్యాన్ని ఈబ్యాంకుల్లో జమకడతారు. అలానే అమెరికన్ వర్తకులు తాము దిగుమతి చేసుకున్న భారతీయ సరుకుల

నిమిత్తం చెల్లించాలిసిన ద్రవ్యాన్ని మారకపు బ్యాంకుల్లో జమకడతారు. ఈవిధంగా సమకూడిన మొత్తాన్నుంచి అమెరికన్ ఎగుమతిదార్లకు డాలర్లలో డబ్బు చెల్లించే ఏర్పాటు, భారతదేశవర్తకులకు రూపాయల్లో ద్రవ్యం చెల్లించే ఏర్పాటు మారకపు బ్యాంకులు చేస్తాయి. 1 డాలర్‌కు 4.76 రూపాయలరేటు ప్రకారం ఉభయదేశాల ఎగుమతిదార్లు లావాదేవీలన్నింటిని యీ బ్యాంకులు పరిష్కరించుతాయి.

గతసంవత్సరం భారతదేశం అమెరికాకు చేసిన ఎగుమతుల విలువకంటే, అమెరికానుండి చేసుకున్న దిగుమతుల విలువ ఎక్కువగా వుందనుకోండి. అపుడు మిగతా సొమ్ముకు భారతప్రభుత్వం బంగారం రూపంలో అమెరికాకు చెల్లించవలసి వస్తుంది. అమెరికా ప్రభుత్వం అచటివర్తకులకు డాలర్ల రూపంలో ద్రవ్యం చెల్లించుతుంది.

మరొక విధంగా కూడ ఎగుమతి దిగుమతుల లావాదేవీలను పరిష్కరించుకోవచ్చు. భారతదేశం అమెరికాలోనేగాక యింకా అనేకదేశాలతో వ్యాపారం చేస్తుంది. ఉదాహరణకు గతసంవత్సరం బ్రిటనుకు మనదేశం పంపిన ఎగుమతుల విలువ, ఆదేశాన్నుంచి దిగుమతుల విలువకంటే ఎక్కువనుకుందాం. అపుడు మన ద్రవ్యం స్టెర్లింగు (పౌను) రూపంలో బ్రిటనులో నిల్వ వుంటుంది. బ్రిటను-అమెరికాల వ్యాపార లావా దేవీలలో బ్రిటనుకు అదనంగా డాలర్లు మిగిలితే అపుడు మారకపు బ్యాంకులద్వారా మనదేశం బాకీవున్న డాలర్లను స్టెర్లింగు రూపంలో చెల్లించవచ్చు. ఇలా వివిధ

దేశాలమధ్య లావాదేవీలు పరిష్కారమైపోగా మిగిలిన సొమ్మును మాత్రమే బంగారం రూపంలో చెల్లించవలసి వస్తుంది.

## రూపాయి పూర్వచరిత్ర

దాదాపు 2 వందల సం॥ రాలు బ్రిటీషు సామ్రాజ్యవాదులు భారతదేశాన్ని పరిపాలించారని మనకు తెలుసు. బ్రిటీషువాళ్ళు రాకముందు భారత దేశంలో వెండి-బంగారు లోహాలను వర్తకవ్యాపారలలో మారకపు సాధనంగా విరివిగా వినియోగించేవారు. ఉత్తరభారత దేశంలో పరిపాలకులు వెండినాణాలను ముద్రించి తమరాజ్యాలలో అంతర్గత చెలామణికి వినియోగించేవారు. వీటితోపాటు బంగారు నాణాలుకూడ చెలామణిలో వున్నప్పటికీ, ఉత్తర దేశంలో వెండినాణాలే హెచ్చుగా చెలామణిలో వుండేవని చెప్పవచ్చు.

దక్షిణ భారతంలో బంగారు నాణాలే (గోపురం, మొహ్రీ, వరహా అనేపేర్లతో) విరివిగా చెలామణి అయ్యేవి. ఐతే ఆరోజుల్లో భారతదేశం అనేక చిన్న చిన్న రాజ్యాలుగా వున్నందున అనేక రకాలవెండి, బంగారు నాణాలు వుండేవి. నాణాల బరువు, వినియోగించే లోహాల నాణ్యం నిర్దిష్టంగా వుండేదికాదు. అందుచేత వెండి, బంగారు నాణాలను సైతం వస్తుమార్పిడికి కొలమానంగా తీసుకొనేటప్పుడు జాగ్రత్త వహించాల్సి వచ్చేది. వెండి, బంగారాల నాణ్యం తెలిసిన షరాబ్‌ల సహాయంతో చెల్లించుతున్న నాణాల విలువను అంచనా వేయడం అవసరమయ్యేది.

1835 లో బ్రిటీషుప్రభుత్వం తమ అధీనంలో వున్న భారత దేశమంతటిలో వెండి రూపాయిని స్టాండర్డ్ కొలమానంగా నిర్ణయించుతూ శాసనం చేసింది. దీని ప్రకారం రూపాయి తులం బరువు వుండాలని నిర్ణయించారు. దీనిలో 180 వడ్లగింజల బరువు (అనగా తులం) ట్రాయ్ వెండి వుండాలని, ఖాయపరచారు. ఈ వెండి రూపాయలతో పాటు 15 రూపాయలతో సమానమైన బంగారు మొహర్లను కూడ ముద్రవేయాలని నిర్ణయించారు.

అప్పటినుంచి రెండవ ప్రపంచ యుద్ధంవరకు భారతదేశమంతటా వెండిరూపాయి స్టాండర్డ్ కొలమానంగా చెలామణి అవుతూంది. దీనితో పాటు కొన్ని సంస్థానాలలో స్వంత నాణాలు కూడ ముద్రించి చెలామణి చేసేవారు. హైద్రాబాద్ సంస్థానంలో "హాలీ రూపాయి" చెలామణిలో వుండేది.

బ్రిటీష్ సామ్రాజ్యంలో భాగంగా వున్నందున బ్రిటనులో చెలామణి అయ్యే బంగారు నాణాలుకూడ – నవర్సులు– భారతదేశంలో చెలామణి అయ్యేవి. మొదటి ప్రపంచయుద్ధం వరకు రూపాయి 1 షిల్లింగు 4 పెన్నీలతో సమానం. అనగా నవర్సు 15 రూపాయలకు సమానం.

అప్పటివరకు బ్రిటనులో బంగారు నాణాలు (నవర్సులు) స్టాండర్డు కొలమానంగా చెలామణిలో వున్నందున, గోల్డ్ స్టాండర్డ్ అమల్లో వున్నందున, పరోక్షంగా రూపాయి కూడ బంగారు స్టాండర్డుతో ముడిపడి వుండేది. అంటే రూపాయలు తీసుకువెళ్ళి బంగారం యివ్వమంటే ప్రభుత్వం అందుకు

బాధ్యత తీసుకోనప్పటికీ, విదేశ వ్యాపారానికి సంబంధించి నంతవరకు నిర్దిష్టమైన మారకపు రేటు ప్రకారం దిగుమతు లకు చెల్లించే నిమిత్తం బంగారం యివ్వడానికి ప్రభుత్వ హామీ వుండేది.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం గోల్డ్ స్టాండర్డు వదలివేసింది. అప్పటినుంచి పౌనుకు నవన్న బంగారం యిచ్చే బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వానికి లేదు. 1926 లో రూపాయి-పౌను మారకపు రేటును కూడ బ్రిటీషు ప్రభుత్వం మార్చింది. 1 రూపాయి 1 షిల్లింగ్ 6 పెన్నీలతో సమానమని నిర్ణయించింది. అనగా 1 పౌను రు 13-8-0 తో సమానం. నేటి వరకు పౌను - రూపాయి మారకపు రేటుగా యిదే చెలామణి అవుతోంది. ఈ మారకపు రేటు ప్రకారమే బ్రిటను - భారత దేశాల మధ్య లావాదేవీలన్నీ పరిష్కరించబడు తున్నాయి.

మన దేశం నుండి ముడిపదార్థాలను, చౌకగా తీసుకు పోవడానికి, బ్రిటీషు సరుకులను మన దేశంపై తక్కువ ధరకు రుద్దడానికి బ్రిటీషు సామ్రాజ్య వాదులు ఈ మారకపు రేటును నిర్ణయించారు. అందుచేతనే భారత జాతీయ కాంగ్రెసు ఈ రేటును తీవ్రంగా నిరసించుతూ ఆందోళన చేసింది. పౌను 15 రూపాయలు (రూపాయి = 1 షి. 4 పెన్నీలుగా) మారకపు రేటుగా వుండాలని అనేకసార్లు తీర్మానించింది. కాని భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడ మారకపు రేటు పూర్వంవలెనే వుంది. దీనికి కారణం ఏమిటి?

రెండో ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటీషు సామ్రాజ్య వాదులు యుద్ధ అవసరాలకు మనదేశ సరకులను విపరీతంగా వాడుకున్నారు. ఆరోజుల్లో జీవితావసర వస్తువులు దొరకనందున ప్రజలు ఎలా కటకటలాడారో మనకు తెలుసు. కరువు కాటకాలు వెన్నాడాయని, బెంగాలు కరువులో లక్షలాది ప్రజలు ఆహుతి అయ్యారని మనకు గుర్తుంది. యుద్ధావసరాలకు మనదేశ సరకులను విపరీతంగా వినియోగించుకోవడంవల్ల బ్రిటీషువాళ్ళు 1946 నాటికి మనదేశానికి సుమారు 1600 కోట్ల రూపాయిలు బాకీపడ్డారు. పౌనుల రూపంలో ఈ సొమ్మంతా యుద్ధం ముగిసేనాటికి బ్రిటనులో నిల్వవుంది. మారకపు రేటు మార్చితే, బాకీ మొత్తం తగ్గుతుంది. అది భారతదేశానికి నష్టం. అందుచేత మారకపు రేటు యిప్పటికీ 1926 లో నిర్ణయించిన విధంగానే సాగుతోంది.

బ్రిటనులో ద్రవ్యానికి కొలమానంగా పౌను వుందని మనం ఎరుగుదుం. 1949 వరకు ఒక పౌను 4.80 అమెరికన్ డాలర్లతో సమానంగా ఎంచబడేది. కాని 1949 లో ఈ మారకపు రేటును మార్చడానికి ఉభయ ప్రభుత్వాలు ఒడంబడిక చేసుకున్నాయి. పౌను మారకపు విలువను నూటికి 30 వంతులు తగ్గించడానికి బ్రిటీష్ ప్రభుత్వం అంగీకరించింది. అప్పటినుంచి ఒక పౌను 3.36 డాలర్లతో సమానంగా మారకపు రేటు ఉంటూంది.

పౌను మారకపు విలువను తగ్గించడానికి బ్రిటను అంగీకరించుటతో పాటు, పౌనుతో ముడిపెట్టి వున్న రూపాయి విలువకూడ తగ్గింది. అంతకుముందు 1 రూపాయి 30.225

అమెరికన్ సెంట్స్‌కు (100 సెంట్లు = 1 డాలరు) సమానంగా ఎంచబడేది. కొత్త ఒడంబడిక ప్రకారం రూపాయి 21 అమెరికన్ సెంట్స్‌కు సమానమని మారకపు రేటు నిర్ణయించబడింది. 1949 కి పూర్వం ఒక డాలరుకు 3 రూపాయల ఆరణాలు సమానమైతే, కొత్త మారకపు రేటు ప్రకారం ఒక డాలరు 4 రూపాయల 12 అణాలతో సమానంగా నిర్ణయించబడింది.

కొత్త మారకపు రేటు వల్ల భారతదేశం అమెరికాకు ఎగుమతిచేసే మాంగనీస్ వగైరా ముడిపదార్థాలకు అంతకు ముందుకంటే డాలర్లలో తక్కువ ధర గిడుతున్నది. రెండో వైపున అమెరికానుండి దిగుమతి చేసుకునే యంత్రాలు వగైరా ధరలు రూపాయల్లో నూటికి 30 వంతులు పెరిగాయి. కొత్త మారకపు రేటు వల్ల భారతదేశాన్నుంచి ముడి పదార్థాలను చౌకగా అమెరికా కొనగలుగుతోంది; రెండోవైపున అమెరికా అమ్మే యంత్రాలు వగైరాకు ఎక్కువ ధర మనం చెల్లించుకోవలసి వస్తూంది.

1949 ఒడంబడిక తర్వాత కూడ రూపాయి – పౌను మారకపు రేటు పూర్వంవలెనే వుంది. అనగా రూపాయి 1 షిల్లింగ్ 6 పెన్నీలతో లేదా పౌను రు 13–8–0 తో సమానంగా లెక్కించబడుతోంది. బ్రిటీషు సామ్రాజ్యంలో భాగాలైన ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రికా వగైరా దేశాలతో వ్యాపారంలో ఈ మారకపు రేటు ప్రాతిపదికగా వుంటూంది.

భారతదేశం స్వాతంత్ర్యం పొందాక స్టెర్లింగ్ ప్రాంత దేశాలతోనే (తమనాణాలను పౌన్లతో ముడిపెట్టుకొనియున్న దేశాలు) గాక ఇతర పశ్చిమ దేశాలన్నిటితోనూ వర్తక వ్యాపారాలు అభివృద్ధి చేసుకోడానికి కృషిచేస్తూంది. స్విట్జర్లాండు, స్వీడన్, నార్వే, ఫ్రాంసు, ప. జర్మనీ వగైరా యూరోపియన్ దేశాలతో పాటు జపాన్, ఈజిప్టు వగైరా ఆసియా దేశాలతో కూడ వర్తక ఒడంబడికలు జరుగుతున్నాయి. ఈదేశాలన్నిటితోనూ మారకపు రేట్లు కూడ నిర్ణయించబడుతున్నాయి. కాని ఈ లావాదేవీ లన్నిటిలో పౌను స్టెర్లింగుకు - రూపాయికి వున్న పౌను = 13.50 రూపాయలు మారకపు రేటే ప్రాతిపదికగా వుంటూంది. అందుచేతనే నేటికీ స్టెర్లింగ్ ప్రాంతంలో భారతదేశం కూడ ఒక భాగంగా ఎంచబడుతూంది.

సోవియట్ యూనియన్ స్టాండర్డ్ నాణెమైన రూబుల్ భారతదేశ నాణెమైన రూపాయి పావులాతో సమానం. అంతేగాక సోవియట్ యూనియన్ నుంచి భారతదేశం దిగుమతి చేసుకునే యంత్ర సామగ్రి, ఉక్కు వగైరాలను రూపాయల్లోనే చెల్లించడానికి సోవియట్ ప్రభుత్వం అంగీకరించుతోంది. అలా నిల్వతేలిన రూపాయి కరెన్సీతో భారతదేశం నుండి తమకవసరమైన వస్తువులను దిగుమతి చేసుకోడానికి కూడ సోవియట్ ప్రభుత్వం ఒడంబడిక చేసుకుంది. ఇలాంటి ఒడంబడికవల్ల భారతదేశం దిగుమతి చేసుకునే అదనపు సరుకుకు బంగారం చెల్లించాలిసిన అగత్యమూ వుండదు; విదేశ మారకం కొరత అనే చిక్కూ రాదు.

రెండవ పంచవర్ష ప్రణాళికను అమలు జరిపేందుకు విదేశాల నుండి యంత్ర సామగ్రిని ఎక్కువగా దిగుమతి చేసుకోవలసి వున్నందున భారతదేశానికి విదేశ మారకం కొరత ఏర్పడిందని మనకందరికీ తెలుసు. భారతదేశం బ్రిటీషు కామన్‌వెల్తులో సభ్యరాలుగా వున్నందున, రూపాయి పౌన్‌స్టెర్లింగుతో ముడిపడివున్నందున కామన్‌వెల్తు దేశాలతో ఎగుమతి దిగుమతులకు కొంత సౌలభ్యమున్నా, ఇతర దేశాలతో వ్యాపారానికి కొన్ని ఆటంకాలు ఏర్పడుతున్నాయి. ఉదాహరణకు బ్రిటిష్ కామన్‌వెల్తుకు డాలర్ల కొరత వుంది. భారతదేశానికీ డాలర్ల కొరత వుంది. కామన్‌వెల్తు దేశాల మొత్తం డాలర్ అవసరాలను దృష్టిలో వుంచుకొని, లభ్యమవుతున్న డాలర్ మారకాన్ని కామన్‌వెల్తులోని వివిధదేశాలకు పంచుతున్నారు. దీనివల్ల భారతదేశ సత్వర పారిశ్రామికాభి వృద్ధికి ఆటంకం కలుగుతోంది. యంత్రాల దిగుమతికి స్టెర్లింగ్ నిల్వలపై ఆధారపడటమో లేక అమెరికానుండి డాలర్ అప్పులకు ఎదురుచూడటమో జరుగుతోంది.

భారతదేశం ఈ పరిస్థితి నుండి బయటపడి స్వతంత్ర ఆర్థిక ప్రతిపత్తిని సంపాదించుకోడానికి కృషి చేయాలిసివుంది. సోషలిస్టు దేశాలైన సోవియట్ యూనియన్, జెకోస్లోవేకియా, రొమేనియా, తూర్పు జర్మనీ వగైరా దేశాలు దీర్ఘకాల వాయిదాలపై తీర్చుకునే షరతుతో తక్కువ వడ్డీకి యంత్రాలను సప్లయిచేయడానికి తమ సంసిద్ధతను తెలిపాయి. సోవియట్ యూనియన్ సంవత్సరానికి 10 లక్షల టన్నుల ఉక్కును వుత్పత్తిచేసే కర్మాగారాన్ని భిలాయ్‌లో నిర్మించుతోంది.

జెకోస్లోవేకియా భారీయంత్ర నిర్మాణ కర్మాగారాన్ని నిర్మించ డానికి ఒడంబడిక చేసుకుంది. రొమేనియా సోవియట్ యూనియన్లు నూనె పరిశోధనలో సహాయం చేస్తున్నాయి. నూనె శుద్ధి కర్మాగారాల నిర్మాణంలో సహాయపడటానికి రుమేనియా సిద్ధంగా వుంది. తూర్పు జర్మనీ ముడిఫిల్మ్ తయారుచేసే ఫ్యాక్టరీని నిర్మించడానికి దీర్ఘకాల వాయిదాలపై చెల్లించే అప్పు యివ్వడానికి సంసిద్ధతను తెలిపింది.

ఐతే సోషలిస్టు దేశాలనుండి పరిశ్రమల నిర్మాణానికి వస్తున్న యీ చేయూతను భారత ప్రభుత్వం తగినంతగా స్వీక రించడం లేదు. సోషలిస్టు దేశాలన్నీ తామిచ్చే అప్పులను తిరిగి రూపాయల్లో తీసుకోడానికి సంసిద్ధతను తెలుపుతు న్నాయి. అందుచేత సోషలిస్టు దేశాలతో వ్యాపారంలో విదేశ మారకం కొరత అనే సమస్య లేనే లేదు. ఐనప్పటికీ భారత ప్రభుత్వానికి గతంనుంచి ఆంగ్లో — అమెరికన్ సామ్రాజ్య వాదులతో వున్న ఆర్థిక సంబంధాల వల్లనూ, ప్రభుత్వ యంత్రాంగంలో కీలక స్థానాలలో వున్న బురో క్రెటిక్ వుద్యోగులు, నిపుణులు వగైరా పెట్టుబడిదారీ దేశా లతో వ్యాపారం యెడల పక్షపాతం గల వారగుటచేతనూ మన విదేశ వ్యాపారం ఆంగ్లో - అమెరికన్ కూటమి దేశాల తోనే ఎక్కువగా సాగుతోంది. సోషలిస్టు దేశాలతో యిది వరకు కంటే వ్యాపారం కొంత పెరిగినమాట వాస్తవమే ఐనా సోషలిస్టు ప్రపంచంతో భారతదేశం జరుపుతున్న వ్యాపారం, మొత్తం విదేశ వ్యాపారంలో స్వల్పభాగమే ననవచ్చు.

---

# 4. ధరల హెచ్చు - తగ్గులకు సప్లయి - డిమాండులకు సంబంధం

గోల్డ్ స్టాండర్డ్ (బంగారు కొలమానం) అమల్లో వున్నపుడు, వెండి రూపాయలు చెలామణి అవుతున్న రోజుల్లో, అనగా మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం వస్తువుల ధరలలో విపరీతమైన వ్యత్యాసం వుండేది కాదు. ధాన్యం, ప్రత్తి వగైరా వ్యవసాయ పంటలు సరిగా పండక కొరత ఏర్పడినపుడు ధరలు కొంత హెచ్చడం, బాగా పండినపుడు ధరలు కొంత తగ్గడం సహజమే. కాని యుద్ధానంతరం మనం చూస్తున్నట్లుగా ధరలు విపరీతంగా పెరగడం, లేదా మరీ ఘోరంగా పడిపోవడం గోల్డుస్టాండర్డు రోజుల్లో వుండేదికాదు.

రెండో అధ్యాయంలో ద్రవ్యానికి కొలమానంగా భారతదేశంలో వెండి రూపాయి ఎలా రూపొందినదో చూశాం. రెండు శేర్ల ధాన్యం, లేక గజం గుడ్డ ధర రూపాయి అంటున్నామంటే ఆ వస్తువులను తయారు చేయడానికి మానవునికి ఎన్నిగంటల శ్రమశక్తి అవసరమైందో తులం వెండిని తయారు చేయడానికి అంతే శ్రమశక్తి అవసరమయిందనీ, అందుచేతనే ఆ వస్తువులను రూపాయితో మారకం చేసుకోడానికి వ్యాపారస్తులు పరస్పరం అంగీకరించుతున్నారనీ అవగాహన చేసుకున్నాం. ఉదాహరణకు రెండు శేర్ల ధాన్యం పండించడానికి సగటున 4 గంటల శ్రమ అవసరమయిందనుకుందాం. గజం గుడ్డను తయారు చేయడానికి కూడ సగటున 4 గంటల శ్రమ అవసమయినపుడే వాటిని పరస్పరం మారకం

చేసుకోడానికి ఉత్పత్తిదారులు అంగీకరించుతారు. తులం వెండి తయారుచేయడానికి సగటున నాలుగు గంటల శ్రమ పడుతుందని అంచనా వేసినపుడే 2 శేర్ల ధాన్యంతో లేదా గజం గుడ్డతో తులం వెండిని మారకం చేసుకోడానికి వర్తకులు అంగీకరించుతారు.

వస్తుమార్పిడి విధానానికి ప్రాతిపదిక యిదేనని మనం తెలుసుకున్నాం. ద్రవ్యానికి కొలమానంగా వెండి రూపాయి రూపొందడానికి కూడ యిదే కీలకమని అవగాహన చేసుకున్నాం.

గజం రూపాయి విలువ గల గుడ్డ తయారుచేసిన సాలి బజారులో గజాన్ని ముప్పావులాకు అమ్మాలిసి వచ్చిందనుకుందాం. అప్పుడు అతడు పడినశ్రమలో మూడోవంతుకు మాత్రమే ప్రతిఫలం వచ్చిందన్నమాట. సాలి వినియోగించిన 4 గంటల శ్రమకు ప్రతిఫలంగా 3 గంటల శ్రమను వినియోగించిన వస్తువును మాత్రమే కొనేందుకు అవకాశం అతనికి లభించుతోంది. అలాంటపుడు బట్టలు నేయడం గిట్టుబాటు కావడం లేదని మానివేస్తాడు. బట్టల ఉత్పత్తి తగ్గుతుంది.

బజారులోనికి గుడ్డ తగినంతగా రాదు. కొరత ఏర్పడుతుంది. గజం ధర రూపాయిన్నరకు పెరిగిందనుకుందాం. అపుడు సాలీ తాను పడిన నాలుగు గంటల శ్రమకు బదులు ఆరు గంటల శ్రమ విలువగలిగిన వస్తువులను కొనేందుకు

అవకాశం ఏర్పడుతుంది. అలాంటి సమయంలో బట్టల నేత గిట్టుబాటుగా వుందని మరీ ఎక్కువమంది ఈ వృత్తిలోకి దిగుతారు. ఉత్పత్తి పెరుగుతుంది.

పైన చెప్పిన వుదాహరణలో గజం గుడ్డ ధర రూపాయి నుంచి ముప్పావులాకు తగ్గిందంటే మార్కెటులో గిరాకీ (డిమాండు) లేకపోవడమే కారణం. రూపాయిన్నరకు పెరిగిందంటే మార్కెటులో గిరాకీ పెరగడమే కారణం. కాని గజం గుడ్డ విలువలో – అనగా దానిని తయారుచేయడానికి వినియోగించిన సగటు శ్రమ గంటల్లో – మార్పేమీరాలేదు. డిమాండుకు మించిన సప్లయి మార్కెటుకు వచ్చినపుడు ధర పడిపోయింది. డిమాండుకు తగిన సప్లయి మార్కెటుకు రానపుడు – కొరత ఏర్పడినపుడు – ధర పెరిగింది. అధిక సప్లయి వున్నపుడు ధర పడిపోయి వుత్పత్తి తగ్గుతోంది. గిరాకీ వున్నపుడు ధర పెరిగి, వుత్పత్తి పెరుగుతోంది.

ఈవిధంగా డిమాండు – సప్లయిల మధ్య వ్యత్యాసాలను అనుసరించి వస్తువుల ధర పెరగడం, తగ్గడం సర్వసాధారణంగా జరుగుతూనే వుంటుంది. కాని ఆ యా వస్తువులను తయారుచేయడానికి వినియోగించిన సగటు శ్రమ విలువ ఒకే విధంగా వుంటుంది. అధిక సప్లయి మార్కెటుకు వచ్చి, డిమాండు తరిగినపుడు సగటు శ్రమ విలువకంటే ధరలు తరుగుతాయి. సప్లయి తరిగి, డిమాండు పెరిగినపుడు శ్రమ విలువకంటే ధరలు పెరుగుతాయి.

కొన్ని సమయాల్లో అన్ని వస్తువుల ధరలు ఒకేసారి పెరగడం, మరికొన్ని సమయాల్లో అన్ని వస్తువుల ధరలు ఒకే సారి పడిపోవడం కూడ జరుగుతుంది. దీనికి కారణం ఏమిటి? పూర్తి వెండి, బంగారు నాణాలను ద్రవ్యానికి కొలమానంగా వాడే రోజుల్లో యిలా జరిగితే వెండి, బంగారు లోహాల విలువ పడిపోయినందున అన్ని వస్తువుల ధరలు ఒకేసారి పెరిగి వుండవచ్చు. లేదా వెండి బంగారు లోహాల విలువ పెరిగి నందున అన్ని వస్తువుల ధరలు ఒకేసారి పడిపోయివుండవచ్చు.

ఐతే వెండి, బంగారు లోహాల విలువ పెరగడానికి, లేదా తరగడానికి కారణం ఏమిటనే ప్రశ్న వస్తుంది. కొత్త గనులు దొరికినందున, వెండి బంగారు లోహాలను త్రవ్వి, శుభ్రపరచేందుకు పడవలసిన శ్రమ తగ్గితే, వాటి విలువ తగ్గుతుంది. లేదా పాతగనుల వుత్పత్తి తగ్గిపోయి, వాటిని త్రివ్వి శుభ్రపరచేందుకు ఎక్కువ శ్రమపడవలసివస్తే వెండి, బంగారాల విలువ పెరుగుతుంది. గనుల్లో నూతన యంత్రాల వినియోగం వగైరా ద్వారా కూడా వెండి, బంగారాల సగటు శ్రమవిలువ తగ్గవచ్చు.

ఈమార్పు ఎందువల్ల జరిగినప్పటికీ గోల్డ్ స్టాండర్డు వున్న దేశాలలో ఔన్సు బంగారు తయారుచేయడానికి విని యోగించిన శ్రమ గంటలు తగ్గినపుడు బంగారం ధర తగ్గడం, ఇతర వస్తువుల ధర పెరగడం పరిపాటిగా వుండేది. అలాగే వెండి రూపాయి కొలమానంగా వున్న మనదేశంలో తులం వెండి వుత్పత్తిచేయడానికి వినియోగించిన శ్రమ గంటలు తగ్గి

నపుడు, వెండి ధర తగ్గడం ఇతర వస్తువుల ధర పెరగడం పరిపాటిగా వుండేది.

ఐతే గత వంద సంవత్సరాల చరిత్రను పరిశీలించినపుడు కేవలం వెండి, బంగారాల విలువ తరగడం, పెరగడం వల్లనే ధరలు హెచ్చడం, పడిపోవడం జరగడంలేదని మనకు బోధపడుతుంది. పెట్టుబడిదారీ ఆర్థిక విధానం పెంపొందుతూ వచ్చిన గత శతాబ్దంలో ఒక్కొకసారి అన్నివస్తువుల ధరలు విపరీతంగా పెరగడం, ఒక్కొకసారి అన్నివస్తువుల ధరలు పూర్తిగా పడిపోవడం సంభవించింది. పైన చెప్పిన ఒడిదుడుకులకు వెండి బంగారాల శ్రమ విలువలో మార్పురావడం కారణంకాదు. వర్తకంలో వచ్చే ఈ ఒడిదుడుకులను ధరలు విపరీతంగా పెరిగినపుడు ఆర్థిక వికాసదశ (బూం) అనీ, ధరలు విపరీతంగా పడిపోయినపుడు ఆర్థిక దుస్థితి (స్లంపు) అనీ పిలుస్తుంటారు. అలాంటి సమయాల్లో జరిగే ఒడిదుడుకులను అర్థంచేసుకుంటేగాని ద్రవ్య సరఫరాకు ధరలకు మధ్యవున్న సంబంధం బోధపడదు.

వర్తకం బాగా సాగుతున్నపుడు ఉత్పత్తి అవుతున్న వస్తువులకంటే డిమాండు ఎక్కువగా వుంటుంది. అందుచేత కొనుగోలుదార్ల మధ్య విపరీతంగా పోటీవస్తుంది. వస్తువు విలువకు మించిన ధర చెల్లించి కొనడానికి తయారౌతారు. దీనివల్ల వస్తువులకున్న సహజమైన మారకపు విలువకంటే హెచ్చుధర లభ్యమవుతుంది. ఉత్పత్తిదారులకు సాధారణంగా వచ్చే లాభంకంటే డిమాండు ఎక్కువగావున్న వస్తువులపై

ఎక్కువ లాభం వస్తుంది. అలాంటపుడు ఎక్కువమంది పెట్టు బడిదారులు ,అదేరకం వస్తువులను తయారుచేసే ఫ్యాక్టరీలను నిర్మించడానికి తమ ద్రవ్యాన్ని వినియోగించుతారు. క్రమంగా వస్తూత్పత్తి పెరిగి, డిమాండుకు సరిపడిన సప్లయి మార్కెటు లోకి వస్తుంది. ధరలు మారకపు విలువకు సమానస్థాయికి వస్తాయి. తరువాత క్రమంగా ఇంకా వుత్పత్తి పెరిగి, డిమాం డుకు మించిన సప్లయి మార్కెటుకు వస్తుంది. అపుడు ఉత్పత్తి దారులంతా తమ సరుకును విడుదలచేసుకోడానికి మార్కె టుకు పరుగెత్తుతారు. ఆ సరకులను కొనే వినిమయదార్లు మార్కెటులో దొరకరు. అందుచేత విక్రయదార్ల మధ్య పోటీ ఏర్పడుతుంది. అలాంటపుడు ఆ వస్తువులధర మారకపువిలువ స్థాయికంటే క్రిందకు పడిపోతుంది. ఉత్పత్తిదార్లు నష్టపడ తారు. తమఫ్యాక్టరీలను మూసివేయడానికి, లేదా ఉత్పత్తిని తగ్గించడానికి పెట్టుబడిదార్లు పూనుకుంటారు, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికుల సంఖ్య తగ్గుతుంది. నిరుద్యోగుల సంఖ్య పెరుగుతుంది. ప్రజల కొనుగోలు శక్తి కూడ క్రమంగా తగ్గు తుంది. జీవితావసర వస్తువులకు డిమాండు పడిపోతుంది.

ఈవిధంగా దుస్థితి ఒక పరిశ్రమనుండి మరొక పరిశ్రమకు వ్యాపించుతుంది. క్రమంగా దేశంలోని పరిశ్రమలలో ఎక్కువ భాగం మూతపడుతాయి. నిల్వపడి ఉన్న సరుకులు ఖర్చు కావడానికి చాలాకాలం పడుతుంది. లేదా కొన్ని ధ్వంసం చేయబడతాయి. ఉదాహరణకు ప్రతి ఆర్థిక సంక్షోభం లోనూ గోధుమ, కాఫీ వగైరా ఆహార పదార్థాల నిల్వలలో కొంతభాగం నాశనం చేశారు. మిగిలిన సరకులకైనా తగిన

ధరను రాబట్టే దృష్టితో ఇలా చేశారు. కొన్ని సందర్భాలలో గనులను పూర్తిగా బంద్ చేయడం, కొన్ని ఫ్యాక్టరీలను మూడపీకడం కూడ సంభవించింది. ఈ చర్యలన్నిటివల్ల మరల వస్తువులకు కొరత ఏర్పడి క్రమంగా మరల ధరలు పెరుగుతాయి. వ్యాపారం వృద్ధిచెందడం, ఉత్పత్తి పెరగడం, లాభాలు పెరగడం, తిరిగి అధికోత్పత్తి, తిరిగి ఆర్థిక దుస్థితి ఈవిధంగా పెట్టుబడిదారీ దేశాలలో ఆర్థిక చక్రం తిరుగుతుంటుంది.

దశలవారీగా కొన్ని సంవత్సరాల కొకసారి వచ్చే ఆర్థిక వికాసదశలో (Boom period) ధరలు పెరగడం లేదా ఆర్థిక దుస్థితిదశలో ( Slump period ) ధరలు పడిపోవడం సర్వసాధారణమైపోయింది. ఈ హెచ్చు తగ్గులకు బంగారం విలువతో గాని వస్తువులు ఉత్పత్తి చేయడానికి వినియోగించిన శ్రమగంటలతో గాని నిమిత్తం లేదు. ఈవిధంగా వస్తువుల సప్లయి డిమాండుల వ్యత్యాసాన్ని అనుసరించి ధరలు మారుతూ వుండటంవల్ల, వస్తువుల ధరలన్నీ కేవలం సప్లయి-డిమాండుల పైనే ఆధారపడి వుంటాయని ప్రజలు అనుకొంటారు. వస్తువు లన్నిటికీ సహజమైన "మారకపు విలువ" ఒకటి వుందనీ, దాని పరిధిలోనే ధరలు హెచ్చడం లేదా తగ్గడం జరుగుతుందనీ, ఆ యా వస్తువులను తయారుచేయడానికి వినియోగించే శ్రమగంటలే మారకపు విలువకు ప్రాతిపదిక అనీ గుర్తించడం అవసరం.

ఒకదశలో ధరల హెచ్చు తగ్గులను పరిశీలించాలంటే, ఆ దశలో ఆ యా వస్తువుల గరిష్ట ధరను కనిష్ట ధరను దృష్టిలో

వుంచుకుని సగటు ధరను తేల్చవలసి వుంటుంది. ఉదాహరణకు మొదటి ప్రపంచ యుద్ధకాలంలోను, ఆ తర్వాత ధరల హెచ్చు తగ్గులను పరిశీలించేటపుడు సర్వసాధారణంగా 1913 సంవత్సరపు ధరలను ప్రాతిపదికగా తీసుకునేవారు. అలాగే రెండో ప్రపంచ యుద్ధకాలంలోనూ, ఆ తర్వాత ధరల హెచ్చు తగ్గులను పరిశీలించేటపుడు 1938 – 39 సంవత్సరపు సగటు ధరను ప్రాతిపదికగా తీసుకుని లెక్కించేవారు.

1938 లో ధోవతుల జత ధర రెండు రూపాయలు వుందనుకోండి. 1958 లో అదేరకం ధర ఎనిమిది రూపాయలకు పెరిగింది. అంటే ఇరవై సంవత్సరాల కాలంలో నూటికి 400 వంతుల చొప్పున పెరిగిందని అంటాము. అలాగే 1938 లో బియ్యం ధర బస్తా 1 కి 20 రూపాయలు వుందనుకోండి. 1958 లో 70 రూపాయలకు పెరిగింది. బియ్యం ధర నూటికి 350 వంతులు పెరిగిందంటాం. అలాగే జీవితావసర వస్తువులన్నిటి ధరలను పరిశీలించి, ధరల పెరుగుదలకు ఇండెక్సును (సగటును) లెక్కకడతారు.

ధరల ఇండెక్సును తయారుచేయడంలో యుద్ధానికి ముందు సంవత్సరమైన 1938 ధరలను ప్రాతిపదికగా తీసుకోవాలని శ్రామికులు సహజంగా కోరుతారు. కాని పెట్టుబడిదారులు 1946 ధరలను ప్రాతిపదికగా తీసుకోవాలని వాదించుతారు. మొదటి పద్ధతి ప్రకారం లెక్కించితే నూటికి 400 వంతున ధరలు పెరిగినట్లు బోధపడుతుంది. రెండో పద్ధతిలో లెక్కకడితే నూటికి 200 వంతున మాత్రమే పెరిగినట్లు

కన్పించుతుంది. అందుచేత పత్రికల్లో ప్రకటించే ధరల ఇండె క్సును పరిశీలించేటపుడు ఏ ధరలను ప్రాతిపదికగా తీసుకు న్నారో జాగ్రత్తగా గమనించవలసి వుంటుంది.

ప్రపంచమంతటా గోల్డ్ స్టాండర్డు (బంగారం కొల మానం) అమల్లోవున్నపుడు టోకు వ్యాపారానికి సంబంధించి నంతవరకు ధరల హెచ్చుతగ్గులు దాదాపు ఒకే క్రమంలో జరుగుతుండేవి. అలాగే ధరల ఇండెక్స్ కూడ అన్ని దేశాలలో సాధారణంగా ఒకే నిష్పత్తిలో వుండేది. చిల్లర వ్యాపారా నికి సంబంధించినంతవరకు ఆ యా వస్తువులపై ఆ యా ప్రభు త్వాలు వేసే పన్నులను అనుసరించి వివిధదేశాలలో ఆ యా వస్తువుల ధరలలో తేడా వుండేది.

బంగారు కొలమానం రద్దు ఐనప్పటినుంచి వివిధ దేశా లలో ఆ యా వస్తువుల ధరల మధ్య ప్రత్యక్ష సంబంధం లేకుండాపోయింది. ప్రస్తుతం ద్రవ్యానికి – ధరలకు మధ్యవున్న సంబంధాన్ని పరిశీలించే ముందు, ప్రపంచ మార్కెటులో ధరలు ఎలా నిర్ణయమౌతాయో తెలుసుకోవడం అవసరం.

—:0:—

# 5. ప్రపంచ మార్కెటు ధరలు

ప్రతి దేశంలోనూ వస్తూత్పత్తి జరుగుతూంది. అవసరమైన వస్తువులు చాలావరకు ఆ యా దేశాల్లోనే తయారవుతున్నాయి. కాని ఒక దేశానికి అవసరమైన వస్తువులన్నీ ఆ దేశంలోనే సమృద్ధిగా లభించడం లేదు. ఉదాహరణకు మన దేశంలో ధాన్యం పండుతోంది. కాని దేశావసరాలకు సరిపోయినంత సమృద్ధిగా ధాన్యం మన దేశంలో పండటం లేదు. అందుచేత కొరత ధాన్యాన్ని బర్మానుంచో, ఆస్ట్రేలియానుంచో దిగుమతి చేసుకోవలసివస్తూంది. అలాగే మన దేశాన్నుంచి బట్టలను బర్మా దిగుమతి చేసుకోవలసివస్తూంది.

ఇదేవిధంగా మన దేశాన్నుంచి టీ, కాఫీ, తోళ్ళు వగైరా ఇంగ్లండుకు ఎగుమతి అవుతున్నాయి. ఇంగ్లాండు నుంచి రేడియోలు, యంత్రాలు వగైరా మన దేశానికి దిగుమతి అవుతున్నాయి.

గోల్డ్ స్టాండర్డు అమల్లోవుండగా మనం ఎగుమతి చేసే సరుకులు, దిగుమతి చేసుకునే సరుకులు బంగారం విలువతో సరిపోల్చి, ధరలు కట్టేవాళ్ళు. ఒక దేశం ఎగుమతి చేసే సరకుల ధరలను పెంచితే, దిగుమతి చేసుకునే దేశం మరొక దేశాన్నుంచి వాటిని చౌకగా కొనుక్కునేది. ఆవిధంగా ఒకే సరకును ఎగుమతిచేసే దేశాల మధ్య పోటీ యేర్పడేది. ప్రపంచ మార్కెటులో అన్ని వస్తువుల ధరలు బంగారం కొలమానంతో లెక్కించడం వల్ల, ఎగుమతిదార్ల మధ్య ఉండే పోటీవల్ల సరకుల ధరలు అన్ని దేశాలలోనూ ఒకేవిధంగా వుండేవి.

ఉదాహరణకు భారతదేశం ఎగుమతిచేసే తేయాకు, కాఫీ విత్తుల ధర ఎక్కువగా వుంటే, చైనా నుండి తేయాకును, బ్రెజిల్ నుండి కాఫీ విత్తులను ఇంగ్లాండు దిగుమతి చేసుకునేది. ఈ పోటీలో నిలబడగలగాలంటే చైనా, బ్రెజిల్ దేశాలు ఎగుమతిచేసే ధరలకే భారతదేశంలోని వుత్పత్తిదార్లు కూడ అమ్మవలసి వుండేది.

ఇంగ్లాండు తన మిల్లుబట్టలను వెనుకబడిన దేశాలకు ఎగుమతి చేసేది. ఆ దేశాలలో కూడ బట్టల వుత్పత్తి వుండేది. కాని అచట వడుకు నూలుతో చేమగ్గాలపైన చేనేత కార్మికులు బట్ట తయారు చేసేవారు. యంత్రాలపై తయారైన మిల్లుబట్ట 20 గజాల తాను మారకపు విలువ 4 గంటల శ్రమ- లేదా 10 రూపాయలు - వుందనుకోండి. చేనేత కార్మికుడు తాను తయారుచేసిన 20 గజాల తాను 10 రూపాయలకు అమ్మితే, అతనికి గిట్టుబాటు కాదు. ఏమంటే తాను ఆ బట్ట తయారుచేయడానికి అతడు 20 గంటల శ్రమను వినియోగించాడు. అందుచేత మిల్లు యజమానితో చేనేతవారు మార్కెటులో పోటీకి నిలబడలేరు.

బట్టల పరిశ్రమను పెంపొందించిన ఇంగ్లాండు మిల్లుబట్టలను వెనుకబడిన దేశాలకు ఎగుమతిచేయడం ద్వారా, అచట దేశీయ చేనేత పరిశ్రమను దివాళా తీయించింది. కాని తరువాత జపానులో కూడ మిల్లుబట్టల పరిశ్రమ పెంపొందినందున ఇంగ్లాండుకు ప్రపంచ మార్కెటులో పోటీ వచ్చింది.

ఇంగ్లాండు, జపాను వగైరా దేశాలనుండి దిగుమతయ్యే బట్టల పోటీకి నిలబడలేనందున వెనుకబడిన దేశాల చేనేత పరిశ్రమ చితికిపోయింది.

ప్రపంచ మార్కెటులో వివిధ దేశాల పెట్టుబడిదారుల మధ్య కూడ పోటీ ఏర్పడుతుంది. ఒక దేశంలో ఒక పెట్టుబడిదారు కొత్త యంత్రాన్ని ఫ్యాక్టరీలో ప్రవేశపెట్టి, వస్తువులను చౌకగా తయారుచేశాడనుకొందాం. తక్కిన అన్ని దేశాలలోను, ఆ రకం వస్తువులను తయారుచేసే ఫ్యాక్టరీలన్నిటిలోనూ కొత్త యంత్రాలను ప్రవేశపెట్టి తీరాలి. లేకపోతే పాత యంత్రాలతో పనిజేసే ఫ్యాక్టరీలు పోటీలో నిలబడలేవు. ఉదాహరణకు పాతరకం బట్టల మిల్లులో ఒక్కొక నేత కార్మికుడు 2 మగ్గాలను నడుపుతుంటాడు. కొత్త యంత్రాలను ప్రవేశపెట్టిన ఫ్యాక్టరీలో ఒక్కొక నేత కార్మికుడు 8 మగ్గాలను నడుపుతుంటాడు. పాత ఫ్యాక్టరీలో ఒక పని గంటకు 5 గజాల బట్ట తయారౌతుంటే కొత్త ఫ్యాక్టరీలో పని గంటకు 20 గజాల బట్ట తయారౌతుంది. అలాంటప్పుడు పాత ఫ్యాక్టరీ పోటీలో నిలవలేదు. కొత్త యంత్రాన్ని దాన్లో కూడ ప్రవేశపెట్టాలి.

ఈవిధంగా అన్ని దేశాలలోనూ, అన్ని ఫ్యాక్టరీలలోనూ కొత్త యంత్రాలు, కొత్త ఉత్పత్తి సాధనాలు రూపొందుతున్నాయి. ఒక గంట శ్రమతో ఎక్కువ వస్తువులు తయారయినందున క్రమంగా అంతర్జాతీయ మార్కెటులో కొత్త ధరలు రూపొందుతున్నాయి.

గోల్డ్ స్టాండర్డు వున్న రోజుల్లో కూడ పైన చెప్పిన స్వేచ్ఛావ్యాపార సూత్రానికి మినహాయింపులు వుండేవి. దిగుమతి సుంకాలను విధించడం ద్వారా తమ దేశీయ పరిశ్ర మలను అంతర్జాతీయ పోటీనుండి రక్షించుకోడానికి ఆయా ప్రభుత్వాలు కృషిచేసేవి. రక్షణ సుంకాలు విధించిన దేశా లలో ప్రపంచ మార్కెటు ధరల కంటే ఆ వస్తువుల ధరలు హెచ్చుగావుండేవి.

దేశంలోను, ప్రపంచంలోనూ ఒకేరకం వస్తువులను తయారుచేసే కంపెనీలన్నీ ఏకమై, గుత్త వ్యాపార సంస్థలుగా రూపొందినపుడు కూడ ఆ వస్తువుల ధర మారకపు విలువకంటే ఎక్కువగా వుండేది. వివిధ కంపెనీల మధ్య పోటీ లేకుండా చేసుకున్న గుత్త వ్యాపార సంస్థలు అధిక లాభాలను గడించు తాయి. ఉదాహరణకు స్టాండర్డు ఆయిల్ కంపెనీ (అమెరికా) వాళ్ళకు బర్మాషెల్ ఆయిల్ కంపెనీ (బ్రిటనుకు) పోటీ వున్న పుడు పెట్రోల్ - కిరోసిన్ వగైరా చమురు ధరలు తక్కువగా వుండేవి. ఇవి ఏకమై గుత్త వ్యాపార సంస్థగా రూపొందిన పుడు చమురు ధరలు విపరీతంగా పెరిగాయి. చమురు కంపె నీలు తమలో తాము పోటీపడకుండా ఒడంబడికలు చేసుకొని ధరలు పెంచి అధిక లాభాలు సంపాదించుతున్నాయి.

దిగుమతి సుంకాలు విధించడంవల్ల, గుత్త వ్యాపార సంస్థలు ఏర్పడటంవల్ల ప్రపంచ మార్కెటు పోటీ తొలగి పోయి, వస్తువుల ధర మారకపు విలువకంటే హెచ్చుగా వుంటుందని గమనించాం. ఇంతేగాక ఇతర మార్గాలవల్ల కూడ సామ్రాజ్యవాదులు ప్రపంచ మార్కెటు పోటీనుండి

తప్పించుకుంటారు. ఉదాహరణకు బ్రిటిషువాళ్ళు అర్జెంటైనాలో రైలుమార్గాలను నిర్మించడానికి పెట్టుబడి పెట్టారు. ఆ రైల్వేల నిర్వహణలో వచ్చిన లాభాలు అర్జెంటైనా ద్రవ్యంలో పోగయ్యాయి. అర్జెంటైనా నాణెమైన 'పెసో' బ్రిటనులో చెలామణి కాదు. దానికి మారకంగా బంగారం చెల్లించగల తాహతు అర్జెంటైనా ప్రభుత్వానికి లేదు. అందుచేత పెసో లను పౌన్లలోకి ఎలా మార్చాలా ? అనే సమస్య ఎదురైంది. బ్యాంకుల సహాయంతో అర్జెంటైనా లో మాంస పరిశ్రమ నిర్మించారు. బ్రిటనుకు మాంసం ఎగుమతి చేయడం ద్వారా పౌన్లు సంపాదించారు. అర్జెంటైనా నాణాలను తద్వారా బ్రిటీషు పౌన్లతో మారకం చేయడం సాధ్యమయింది. ఈ పద్ధతి బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు రెండు విధాల లాభదాయకంగా తయారయింది. ఒకటి అర్జెంటైనాలో పోగయిన లాభాలను పౌన్లలోకి మార్చుకో గలిగారు; రెండు అర్జెంటైనా నుంచి మాంసం చౌకగా బ్రిటనుకు దొరికింది.

ఈవిధంగా పారిశ్రామికంగా అభివృద్ధిపొందిన దేశాలు తమ పెట్టుబడిని వెనుకబడిన దేశాలలో వినియోగించి ఉభయత్రా లాభం పొందుతాయి. భారతదేశంలోని చేతి పరిశ్రమలను దెబ్బతీసి, ముడిపదార్థాలను చౌకగా కాజేసి, పారిశ్రామిక వస్తువులను మనపై రుద్ది, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు విపరీత లాభాలను గడించారు. ఈ విధంగా సామ్రాజ్యవాదులు వలసదేశాలను తమ ఆర్థిక దిగ్బంధంలో బిగించి, ప్రపంచ మార్కెటు ధరలు అచట అమలు జరుగకుండా అరికట్టేవారు.

ఈ మినహాయింపులు, దిగ్బంధాలు వున్నప్పటికీ ప్రపంచ మార్కెట్టు రోజు రోజుకు విస్తరించుతుండేది. పారిశ్రామిక వస్తువులను అమ్మేందుకు, ముడిపదార్థాలను సేకరించేందుకు ప్రపంచ మార్కెట్టులో తీవ్రమైన పోటీ జరిగేది. కొన్ని వస్తువుల ధరలు ఆ దేశంలో ఎక్కువగా వున్నప్పటికీ, ప్రభుత్వం సబ్సిడీలు యిచ్చి ప్రపంచ మార్కెట్టులో తక్కువ ధరలకు అమ్మించుతారు. ప్రపంచ మార్కెట్టు పోటీలో నిలబడేందుకు దేశంలో అమ్మే వస్తువులపై అదనపు లాభాలు వేసుకుని, ఎగుమతి చేసేవాటిపై వచ్చే నష్టాలను పూడ్చుతారు.

అమెరికా నుంచి ధాన్యం వర్తకుడు యూరపియన్ మార్కెట్టుకు ఓడనిండా ధాన్యాన్ని పంపాడనుకుందాం. వివిధ యూరోపియన్ దేశాలలో ధర ఎలావుందో తెలుసుకుంటాడు. హెచ్చు ధర పలికే దేశానికి వెళ్ళవలసింగా ఓడలోని ధాన్యాన్ని చేర్చవలసింగా వైర్లెస్ టెలిగ్రాం యిస్తాడు. ఈ ధాన్యం దిగుమతయిన దేశంలోని మార్కెట్టు ధరపై ఈ సరకు ప్రభావం పడుతుంది.

ఐతే సాధారణంగా పారిశ్రామిక వస్తువులను ముందుగా ఆర్డరు లేకుండా ప్రపంచ మార్కెట్టుకు పంపరు. వస్తువులు తయారుగాకముందే ఆర్డర్లు బుక్ చేసుకుంటారు. ఉత్పత్తి అయ్యేకొలదీ వివిధదేశాలకు సప్లయి చేస్తుంటారు. అందుచేత సాధారణంగా ప్రపంచ మార్కెట్టు రేటులను అనుసరించే ఎగుమతులు జరుగుతుంటాయి. దిగుమతి చేసుకున్న దేశపు మార్కెట్టు ధరలపై కూడ వీటి ప్రభావం పడుతుంది.

ప్రపంచ మార్కెట్టు విస్తరించేకొలదీ, ఎగుమతి - దిగుమతి సరకుల మొత్తం పెరిగేకొలదీ ప్రపంచ మార్కెట్టు ధరలలో వచ్చే హెచ్చు తగ్గుల ప్రభావం ప్రతిదేశ మార్కెట్టు ధరలపై ఎక్కువగా పడుతుంది. ఒక దేశంలో వచ్చే దుస్థితి క్రమంగా ప్రతిదేశానికి ప్రాకుతుంది.

గోల్డ్ స్టాండర్డు అమలు జరుగుతున్న రోజుల్లో ప్రపంచ మార్కెట్టు స్థితి ఈ విధంగా వుండేది. అన్ని దేశాలు ద్రవ్యానికి ప్రాతిపదికగా బంగారు లోహాన్ని స్వీకరించినందున వివిధ వస్తువుల ధరలు అన్ని దేశాలలోనూ దాదాపు సమానంగా వుండేవి. సుంకాలు విధించడం వల్ల, గుత్త వ్యాపార సంస్థలు ఏర్పడటం వల్ల, సామ్రాజ్యవాద దేశాలు, వలసదేశాల మార్కెట్టును తమ అధీనంలో వుంచుకోడం వల్ల, ఎగుమతులకు కొన్ని ప్రభుత్వాలు సబ్సిడీలు యివ్వడంవల్ల స్వేచ్ఛా వ్యాపారానికి కొన్ని అవరోధాలు; పరిమితులు ఏర్పడిన మాట నిజమే. ఐనప్పటికీ గోల్డ్ స్టాండర్డు వున్న రోజుల్లో ప్రపంచ మార్కెట్టులో వస్తువుల ధరలుదాదాపు సమానంగా వుండేవి. యుద్ధకాలంలోనూ, తరువాత కాలంలోనూ అంతర్జాతీయ వర్తక వ్యాపారాలకు, ప్రపంచ మార్కెట్టు ధరలకు క్రొత్త అవరోధాలు వచ్చాయి. ప్రపంచ మార్కెట్టు ధరలకు, ఆయా దేశాలలోని మార్కెటుధరలకు సన్నిహితత్వం తొలగిపోయింది. ఆ క్రొత్త అవరోధాలు ఏమిటో పరిశీలించుదాం.

---:X:---

# 6. గోల్డ్ స్టాండర్డు వదలివేశాక ధరవరలు

మొదటి ప్రపంచయుద్ధకాలంలో బ్రిటను గోల్డు స్టాండర్డు వదలివేసింది. బంగారు నాణాలను చెలామణిలోనుంచి తీసివేసి, కేవలం కరెన్సీ నోట్లను మాత్రమే చెలామణిలో పెట్టింది. అలాగే యుద్ధంలో చిక్కుకున్న దేశాలన్నీ బంగారు స్టాండర్డును వదలివేశాయి. బంగారం ఎగుమతులను నిషేధించాయి.

యుద్ధావసరాలవల్ల అన్నిరకాల వస్తువుల డిమాండు ఎక్కువయింది. ఆయుధాలకు బట్టలకు రవాణాకు ప్రభుత్వం విపరీతంగా ఖర్చుపెట్టాలిసివచ్చింది. జలాంతర్గాముల దాడుల వల్ల ముడిపదార్థాల కొరత ఏర్పడింది. వీటన్నిటి ఫలితంగా సప్లయి అవుతున్న వస్తువులకంటే డిమాండు చాల యెక్కువయింది. తత్కారణంగా మార్కెటు ధరలు రెట్టింపుకుపైగా పెరిగాయి.

యుద్ధంలో చిక్కుకున్న దేశాలన్నీ తమ అవసరాలను ప్రపంచ మార్కెటులో కొనడానికి ప్రయత్నించినందున ప్రపంచమంతటా యిదే విధంగా ధరలు పెరిగాయి. యుద్ధావసర వస్తువులతోపాటు ముడిపదార్థాలు, ఆహారపదార్థాలు, బట్టలు వగైరా అన్నిటి ధరలు ప్రపంచ మార్కెటులో పెరిగాయి.

బ్రిటను యుద్ధ అవసరాలకు గాను అమెరికానుండి, సామ్రాజ్యంలోని వలస దేశాలనుండి విపరీతంగా దిగుమతి చేసుకోవలసివచ్చింది. ఎగుమతులు తగ్గిపోయాయి. నావికా

రవాణా ద్వారా వచ్చే రాబడికూడ తగ్గిపోయింది. దిగుమతులకు - ఎగుమతులకు మధ్యవున్న తేడాను తీర్చడానికి బ్రిటీషు ప్రభుత్వం వద్ద అంత బంగారం లేదు. అమెరికానుండి పెద్ద మొత్తాలను బ్రిటను రుణంగా తీసుకుంది. ఐనప్పటికీ దిగుమతులకు డబ్బు చెల్లించలేకపోయింది.

ఈ కారణాలన్నిటివల్ల డాలర్ల మారకపు రేటు పెరిగింది; పౌను మారకపు రేటు పడిపోయింది. యుద్ధానికి పూర్వం 1 పౌనుకు 4.86 డాలర్లు సమానమైతే, యుద్ధకాలంలో క్రమంగా 1 పౌను 3.50 డాలర్ల సరుకే రాసాగింది. బ్రిటనులో సరకుకొన్న అమెరికన్ వర్తకుడు పౌనుకు 3.50 డాలర్లు మాత్రమే చెల్లించసాగాడు. అమెరికాలో సరుకు కొన్న బ్రిటిష్ వర్తకుడు 3.50 డాలర్లకే ఒకపౌను చెల్లించవలసి వచ్చింది. చివరకు బ్రిటీషు ప్రభుత్వం పౌను = 3.50 డాలర్ల మారకపు రేటుకు అంగీకరించవలసి వచ్చింది.

యుద్ధ అవసరాలకు, సైనికులకు బ్రిటిష్ ప్రభుత్వం విపరీతంగా ఖర్చుచేయవలసి వచ్చింది. పన్నులు పెంచడం అసాధ్యమయ్యాక రుణం చేయవలసి వచ్చింది. బ్రిటను జాతీయ రుణం 700 కోట్లదాక పెరిగింది. ఈ ద్రవ్యమంతా తిరిగి ప్రభుత్వం ఖర్చుచేసినందున, మార్కెటులో వస్తువుల సప్లయికంటే డిమాండు విపరీతంగా పెరిగింది. దీనినే ద్రవ్యోల్బణం (ఇంఫ్లేషన్) అని పిలుస్తారు. వస్తువుల కొరత యేర్పడి వస్తువుల ధరలు విపరీతంగా పెరిగాయి.

మొదటి యుద్ధకాలంలో జర్మనీలో ద్రవ్యోల్బణం విప రీత రూపాలు ధరించింది. ప్రభుత్వానికి ఋణాలు దొరకడం అసంభవమయింది. ప్రతివారం సైనికుల జీతాలు చెల్లించ డానికి, యుద్ధఖర్చులకు, ఋణాలు తీర్చడానికి ప్రభుత్వం కర్రెన్సీ నోట్లను అదనంగా అచ్చువేయసాగింది. ఈ ద్రవ్య మంతా తిరిగి మార్కెటులోనికి వచ్చినందున వస్తువుల సప్లయికంటే డిమాండు విపరీతంగా పెరిగింది. ధరలు రోజు రోజుకు పెరిగాయి. యుద్ధానికి పూర్వం ఒక మార్కు (జర్మన్ నాణెం) ధరవున్న సరకును లక్షల మార్కులు చెల్లించినా లభ్యమయ్యేది కాదు. మార్కు నోట్లకు విలువ లేకుండా పోయింది.

ద్రవ్యోల్బణం బ్రిటనులోనూ, జర్మనీలోను వచ్చినా రెండిటికి మధ్య చాలా తేడావుంది. బ్రిటనులో ద్రవ్యోల్బణం వల్ల పౌన్ స్టెర్లింగ్ కొనుగోలు శక్తి తగ్గింది. అనగా పౌను మారకపు విలువ, లేదా శ్రమ గంటల విలువ కొంతవరకు పడిపోయింది. అంతేగాని బ్రిటిష్ కర్రెన్సీకి విలువ లేకుండా పోలేదు. క్రమంగా బ్రిటీషు ప్రభుత్వం ద్రవ్యోల్బణాన్ని అరి కట్టగలిగింది. 1925 నాటికి పౌను విలువను పునరుద్ధరించ గలిగింది.

జర్మనీ ప్రభుత్వానికి అలాంటి తాహతు లేకపోయింది. పాత కర్రెన్సీ నంతనూ రద్దుచేయక తప్పలేదు. 1923 లో అమెరికా తదితర దేశాలనుండి ఋణాలతో కొత్త రీచ్ మార్కును ప్రవేశపెట్టవలసి వచ్చింది. జర్మనీలో ద్రవ్యానికి

నూతన స్టాండర్డు కొలమానంగా రూపొందిన కొత్త "రీచ్ మార్కు"కు ఇతర దేశాల కర్రెన్సీతో నూతన మారకపు రేటు క్రమంగా నిర్ణయించబడింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం కొమింగ్‌టాంగ్ చైనాలో యిదేవిధంగా కర్రెన్సీకి విలువలేకుండా పోయింది. చాంకేషేక్ ప్రభుత్వం తమ కర్రెన్సీని ద్రవ్యోల్బణం నుంచి కాపాడలేకపోయింది. నిప్పెట్టి కొనడానికే లక్షల కర్రెన్సీ నోట్లు యివ్వాలిసిన గతి పట్టింది. చాంగ్ ప్రభుత్వాన్ని ఓడించి, అధికారంలోకి వచ్చిన ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వం పాత కర్రెన్సీని రద్దుచేసింది. చైనా ప్రజారిపబ్లిక్‌లో ద్రవ్యానికి స్టాండర్డు కొలమానంగా 'యువాన్' నాణాన్ని రూపొందించింది. దీని విలువ దాదాపు మన రూపాయి కొనుగోలు శక్తితో సమానంగా వుంటుంది.

గోల్డ్ స్టాండర్డును రద్దుచేసిన తర్వాత ద్రవ్యోల్బణం వచ్చిందనీ, ధరలు పెరిగాయని మనం గమనించాం. ఐతే ధరలు పెరగడానికి, ద్రవ్యోల్బణానికి కారణం గోల్డు స్టాండర్డు రద్దు కావడమేనా? అనే ప్రశ్న సహజంగా వస్తుంది.

యుద్ధకాలంలో ఉత్పత్తి దెబ్బతినడం వల్ల, మార్కెటుకు వచ్చే సప్లయిలకంటే డిమాండు చాలా ఎక్కువగా వుంటుంది. ప్రభుత్వం యుద్ధావసరాలకు అనేక లక్షల సైనికులను కార్మికులను వినియోగించుతూ వారికి వేతనాలు వగైరా చెల్లించుతుంది. ఇందువల్ల కూడ వస్తువులకు డిమాండు పెరుగుతుంది. వీటన్నిటివల్ల ధరలు పెరుగుతాయి. ప్రభుత్వం పెద్దమొత్తాలను రుణం తీసుకొని,అదనపు కర్రెన్సీని అచ్చువేసి

యుద్ధావసరాలకు ఖర్చుపెడుతుంది. అందుచేత ద్రవ్యోల్బణం ఏర్పడుతోంది. అంతేగాని గోల్డు స్టాండర్డును రద్దుచేయడం వల్లనే ద్రవ్యోల్బణం ఏర్పడిందనిగాని, ధరలు పెరిగాయనిగాని ఎంచడం సరికాదు.

ఐతే గోల్డు స్టాండర్డును రద్దుచేసిన దేశాల కర్రెన్సీకి, గోల్డు స్టాండర్డును కొనసాగించుతున్న దేశాల కర్రెన్సీతో వున్న మారకపు రేటు మార్పుచెందుతుంది. ఉదాహరణకు రెండో ప్రపంచ యుద్ధానంతరం పౌను - డాలరు మారకపు రేటు తగ్గిందని మూడవ అధ్యాయంలో మనం గమనించాం. ఈ మార్పు ఫలితంగా అమెరికా నుండి బ్రిటను దిగుమతిచేసుకునే సరకుల ధరలు పెరుగుతాయనడంలో ఎలాంటి సందేహం లేదు. ఈ పెరుగుదల ప్రభావం క్రమంగా దేశీయ సరుకుల ధరలపై కూడ పడుతుంది.

ఉదాహరణకు 1949 లో రూపాయి - డాలరు మారకపు రేటు మారింది. అదివరకు రు 3-6-0 లకు ఒకడాలరు సమానంగావుండేది మార్పు అనంతరం డాలరు రు4-12-0తో సమానమయింది. అమెరికానుండి డాలరు విలువచేసే సరుకుకు పూర్వం మనం రు 3-6-0 చెల్లించితే ఇపుడు రు 4-12-0 చెల్లించవలసి వస్తూంది. ఈ విధంగా అమెరికా నుండి మనం దిగుమతి చేసుకునే సరుకులన్నిటకీ మనం నూటికి 30 వంతులు అదనంగా చెల్లించుకోవలసి వస్తూంది. అమెరికా నుండి దిగుమత య్యే సరకుల ధరలు నూటికి 30 వంతులు పెరుగుతాయి. ఈ పెరుగుదల ప్రభావం మనదేశీయ సరుకుల ధరలపై కూడ పడిందని మనం అనుభవం ద్వారా చూస్తున్నాం.

---

# 7. ద్రవ్యం - వస్తూత్పత్తి

ద్రవ్యం వెండి, బంగారు నాణాల రూపంలో తళతళ మెరుస్తున్న రోజుల్లో పీనాసివాడు ద్రవ్యరాసులను చూసుకొని మురిసిపోవడం సహజం. ఇపుడు కరెన్సీ నోట్లకు బ్యాంకు చెక్కులకు అలాంటి ఆకర్షణలేదు. కాని ప్రతి వారికి ద్రవ్యం అవసరమే. బ్రతకాలంటే ద్రవ్యం కావాలి. వ్యక్తులకే గాక సమాజం మనుగడకు కూడ ద్రవ్యం అవసరమే. ప్రస్తుత మున్న ఉత్పత్తివిధానమంతా ద్రవ్యం వినా కొనసాగదు.

ప్రస్తుత సమాజంలో ప్రతి వస్తువు వ్యక్తికో కంపెనీకో స్వంత ఆస్తిగా వుంది. కేవలం గాలి ఒక్కటి మాత్రం ఎవరి ఆస్తి గాకుండా స్వేచ్ఛగావుంది. కొన్ని వెనుకబడిన ప్రాంతా లలో మాత్రం ప్రాచీన గ్రామ ఉమ్మడి చెరువులు, గోభూ ములు వగైరా మిగిలివున్నాయి. కాని ప్రస్తుత సమాజంలో ప్రజలందరూ ఉమ్మడిగా అనుభవించగలిగిన వస్తువులు చాల కొద్దిగానే మిగిలి వున్నాయి. దాదాపు ఆస్తిపాస్తులన్నీ కొలది మంది వ్యక్తుల స్వంత ఆస్తిగా వుంటున్నాయి. మరీ వెనుకబడిన ప్రాంతాలలోని రైతులు, ఆటవిక తెగలు యిప్పటికీ తమ కవసరమైన కొలది వస్తువులను తామే తయారుచేసుకుంటూ స్వయంపోషకంగా వున్నారేమో! అలాంటి వారిని మినహా యించితే సమాజంలోని అత్యధిక సంఖ్యాకులు తమ రెక్కల కష్టాన్ని అమ్ముకుని బ్రతకాలిసి వస్తూంది. ఆస్తిపాస్తులన్నీ కొలదిమంది వ్యక్తుల స్వాధీనంలో వున్న ఈ సమాజంలో ద్రవ్యమనే మారకపు సాధనం లేకుండా ఒక నిముషం గడవదు.

కలిగినవారు తమవద్దవున్న వస్తువులను అమ్ముకోడానికి, లేని వారు తమ కవసరమైన వస్తువులను కొనుక్కోడానికి ద్రవ్యం సాధనంగా వినియోగించుతోంది. స్వంత ఆస్థి బంధనాలనుండి తప్పించుకోడానికి లేదా అవరోధాలను అధిగమించడానికి ద్రవ్యం ఒక సాధనమా అన్నట్లు కన్పించుతోంది.

సమాజ పరిణామంలో వస్తువుల మారకానికి సాధనం గానే ద్రవ్యమనేది రూపొందింది. కాని కాలక్రమేణా సమాజం రెండు గ్రూపులుగా లేదా వర్గాలుగా విభజింపబడింది. ఇందులో ఒక వర్గానికి ఆస్థిపాస్థులు లేవు; తమ అవసరాలను తీర్చుకోడానికి తగినంత ద్రవ్యం లేదు. రెండో వర్గానికి ఆస్థిపాస్తు లున్నాయి; వాటిని మార్చుకునేందుకు, ద్రవ్యంతో తమ అవసరాలను తీర్చుకునేందుకు అవకాశముంది.

అందుచేత మొదటి వర్గం తమ జీవితావసరాలను తీర్చుకునేందుకు ద్రవ్యం ఎలా గడించాలా అనే సమస్యను ఎదుర్కోవలసి వస్తుంది. తమ రెక్కల కష్టాన్ని లేదా శ్రమ శక్తిని అమ్ముకోవడం మినహా వారికి గత్యంతరం లేదు. వారం, వారం పనిచేసి, వేతనాలద్వారా ద్రవ్యం గడించి, జీవితావసరాలను తీర్చుకోవడ మొక్కటే వారికి తరుణోపాయం.

రెండో వర్గాన్ని ఎదుర్కొంటున్న సమస్య వేరుగా వుంది. వారికి ఆస్థివుంది. వీలుగావుంటే దానిని తమ అవసరాలకు వినియోగించవచ్చు; లేదా అమ్మగా వచ్చిన ద్రవ్యంతో తమ అవసరాలను తీర్చుకోనూవచ్చు. ప్రతివారం తిండి, బట్ట, జీవనోపాధి ఎలా లభించుతాయా అనే సమస్య

కాదు ఈ వర్గాన్ని ఎదుర్కొనేది. తమ అవసరాలను తీర్చు కుంటూ, ఆస్థిపాస్తులను ఎలా వృద్ధి చేసుకోవాలా? అనే సమస్య వారిని ఎదుర్కొంటుంది. రెండో అధ్యాయంలో ఈ విషయం చర్చించాము. ఈ వర్గం తమ ఆస్థిని, ద్రవ్యాన్ని పెట్టుబడిగా వినియోగించి తన లక్ష్యాన్ని సాధించుకుంటోంది.

ఫ్యాక్టరీలను యంత్రాలను నిర్మించడానికి, ముడిపదార్థాలను బొగ్గును కొనడానికి రెండో వర్గం ద్రవ్యాన్ని పెట్టుబడిగా వినియోగించుతోంది. మొదటి వర్గంలోని వారికి వేతనాలిచ్చి వారిని కార్మికులుగా రెండో వర్గం తన ఫ్యాక్టరీలలో పనిచేయించుకుంటోంది. ఉత్పత్తి చేయబడిన వస్తువులేవీ మొదటి వర్గానికి-అనగా కార్మికులకు - చెందవు; రెండో వర్గానికి అనగా పెట్టుబడిదారులకు మాత్రమే చెందుతాయి. ఆ వస్తువులను అమ్మగా వచ్చిన ద్రవ్యంలోనుంచి ఖర్చులను తీసివేయగా మిగిలేదంతా (కార్మికులు వుత్పత్తిచేసిన కొత్త సంపద లేదా అదనపు విలువ అంతా) పెట్టుబడిదారులకే దక్కుతుంది.

ఐతే ఈ వర్గాలు ఎల్లప్పుడూ ఒకేమాదిరిగా ఖచ్చితంగా తీర్చిదిద్దినట్లు వుండటం లేదు. కొందరు వ్యక్తులు ఒకవర్గాన్నుంచి మరో వర్గానికి మారవచ్చు. పై రెండు వర్గాలకు మధ్య చాలమంది చిన్న ఆస్థిపరులు వున్నారు. వీరు కేవలం తమ ఆస్థులపై ఆధారపడి జీవితం గడుపుకోలేరు. అందుచేత ఆస్థిలేని కార్మికుల వలెనే వీరుకూడ శ్రమశక్తిని అమ్ముకుని, వేతనాల ద్వారా ద్రవ్యం గడించి జీవితావసరాలు తీర్చు కుంటున్నారు.

సామాన్య కార్మికులకు తమ శ్రమశక్తిని అమ్ముకుని వేతనాలు సంపాదించడం, ఆ ద్రవ్యంతో తమ కుటుంబ జీవితావసరాలను తీర్చుకోవడం యివే నిత్య జీవిత వ్యవహారాలు. దేశంయొక్క ద్రవ్య నీతితో కార్మికుల సంబంధాలకు మొదలు, చివరకూడ యిదే. ఒకవేళ తమ వేతనాలలో స్వల్పమొత్తాన్ని కొందరు కార్మికులు సేవింగ్స్ బ్యాంకులో కష్టపుదినాలకోసం నిల్వచేసుకోవచ్చు. అంతేగాని ప్రతివారం తమ జీవితావసరాలను తీర్చుకోవడానికి కార్మిలు తమ శ్రమశక్తిని అమ్ముకునితీరాలి. అందుచేత కార్మికులకు ద్రవ్యం కేవలం మారకపుసాధనంగా మాత్రమే వినియోగించుతోంది.

ఒకే దేశంయొక్క ద్రవ్యవిధానం, బ్యాంకులు, ద్రవ్య మార్కెటు, స్టాక్ ఎక్ఛేంజి (చట్టా వ్యాపారం), విదేశీ ద్రవ్యమారకపు ఏర్పాట్లు వగైరా అన్నీ పెట్టుబడిదారులకు, లేదా పెద్ద ఆస్థిపరులకు మాత్రమే వినియోగించుతాయి. ఈ ద్రవ్య చెలామణి విధానమంతా పెట్టుబడిదారీ వుత్పత్తి అవసరాలకు వినియోగపడుతుంది. కార్మికుల శ్రమశక్తిని కొనేందుకు అవకాశాలను కూడ కలిగించుతుంది. అధికోత్పత్తి ఫలితంగా ఆర్థిక సంక్షోభం ఏర్పడినపుడు, తయారైన వస్తువులు అమ్ముడుపోనపుడు లేదా నష్టానికి అమ్మాలిసివచ్చినపుడు వుత్పత్తిని ఆవుచేయడానికి కూడ ఈ ద్రవ్య చెలామణియే ఉపయోగపడుతోంది. ధరలు పడిపోగానే అప్పు దొరకడం అసంభవ మవుతుంది. ద్రవ్య సరఫరా మందగించు

తుంది. ఉత్పత్తికి అవసరమైన ద్రవ్యం దొరకదు. కార్మికు లలో నిరుద్యోగం పెరుగుతుంది. ద్రవ్యం అనవసరంగా నిల్వ వుండిపోతుంది.

రెండో వైపున ధరలు పెరిగినపుడు ఉత్పత్తి పెరుగు తుంది: ఉత్పత్తిలో ఎక్కువ ద్రవ్యం వినియోగమవుతుంది. ఎక్కువమంది కార్మికులకు పని దొరకుతుంది. పెట్టుబడి దారులకు అలాంటి దశలో ఎక్కువ లాభాలు చేకూరుతాయి. లాభం వస్తుందనే ఆశయే పెట్టుబడిదారీ విధానంలో వుత్పత్తిని పెంచడానికి మూలాధారం: అలాగే నష్టంవస్తుందనే భీతియే వుత్పత్తిని బంద్ చేయడానికి కారణం. సప్లయి డిమాండులను బట్టి ఒక్కొకరకం వస్తువుల ధర నిర్ణయమౌతుంది. ధరలను బట్టి లాభమో, నష్టమో తేలుతుంది.

ధరల పెరుగుదలతో పాటు లాభాలూ వుత్పత్తీ పెరుగు తున్నదనీ, ధరలు పడిపోవడంతో పాటు లాభాలూ, వుత్పత్తీ తరుగుతున్నదనీ గమనించాం గదా! వీటిపై ఆధారపడి అనేక సిద్ధాంతాలు బయలుదేరాయి. ఉదాహరణకు ధరలు పెరిగి నపుడు లాభాలు వస్తాయనే ఆశతో, వుత్పత్తిని పెంచడానికి మరింత ద్రవ్యం పెట్టుబడి పెడుతున్నారనీ, దాని పర్యవసా నంగా అధికోత్పత్తి జరిగి ధరలు పడిపోతున్నాయనీ చూశాం గదా! కాబట్టి ధరలు పెరిగేసమయంలో బ్యాంకులు వుత్ప త్తిని పెంచడానికి ద్రవ్యం పెట్టుబడిగా యివ్వరాదనీ, తద్వారా అధికోత్పత్తిని అరికట్టవచ్చుననీ ఒకవాదన వుంది. అలాగే ధరలు పడిపోయినపుడు, బ్యాంకులు ఋణమివ్వ నిరాకరించడం మానివేసి, కొనుగోలు శక్తిని పెంచేందుకు ఎక్కువగా ఋణాలు

యిస్తే, ధరలు పడిపోకుండా ఆపుచేయవచ్చుననీ, ఆర్థిక సంక్షోభాన్ని అరికట్టవచ్చుననీ మరోవాదన వుంది. ఒకమాటలో చెప్పాలంటే, ద్రవ్య సరఫరాను కంట్రోలు చేయడంద్వారా వుత్పత్తి హెచ్చు తగ్గులను నియమబద్ధం చేయవచ్చు ననేదే ఈ సిద్ధాంతంయొక్క పర్యవసానం. ప్రస్తుత పెట్టుబడిదారీ విధానం యొక్క ద్విముఖాలైన ఆర్థిక వికాసం (Boom), ఆర్థిక దుస్థితి (Slums) అనే రెండు అరిష్టాలనూ యిది తొలగించగల దనేదే ఈ వాదం సారాంశం.

ఈ సిద్ధాంతం పైకి బాగానే కన్పించుతుంది. ఏమంటే మార్కెటుకు వచ్చిన అధిక సప్లయిలను కొనేందుకు బేరగాళ్లు లభ్యమైనపుడు ధరలు పడిపోవలసిన అవసరంవుండదన్నమాట నిజమే. అలాంటపుడు ఆర్థిక సంక్షోభం రానిమాట నిజమే. ఉత్పత్తిని పెంచడానికి అదనంగా పెట్టుబడి పెట్టేవారు లేనపుడు అధికోత్పత్తికి ఆస్కారం వుండనిమాట నిజమే. ఐతే ద్రవ్య సరఫరాను కంట్రోలు చేస్తున్నవారెవరు ? పెట్టుబడిదారులా ? కార్మికులా ? ఈ వాస్తవిక విషయాలను పరిగణనలోనికి తీసుకోక పోవడమే పైసిద్ధాంతంయొక్క బలహీనత.

ఉదాహరణకు ఒక దశలో ధరలు పడిపోతున్నందున, వుత్పత్తి తగ్గిపోవడం ప్రారంభించిందనుకుందాం. కారణం ఏమిటి ? తయారైన వస్తువులు అమ్ముడుకానందున, లేదా తగినంత లాభం రానందున పెట్టుబడిదారు ఉత్పత్తిని తగ్గించుతున్నాడు. అలాగాక ఒకవేళ ఉత్పత్తిని యింకా కొనసాగించితే తయారయే వస్తువులు పూర్తిగా నిల్వఉండిపోతాయి.

మరిన్ని రుణాలు తెచ్చి, వుత్పత్తిని ఎక్కువచేస్తే నిరుద్యోగులై వున్న కార్మికులకు పనిదొరికి వారి కొనుగోలుశక్తి పెరిగే మాట వాస్తవమే. కాని తయారైన వస్తువులు అమ్ముడు పోతాయనీ, లాభాలు వస్తాయనీ పెట్టుబడిదారులకు నమ్మకం వుండాలిగదా! ధరలు పడిపోతున్న దశలో లాభాలు వస్తాయనే నమ్మకం ఉండదు. కాబట్టే బ్యాంకులనుండి రుణాలు తెచ్చి, వుత్పత్తిని పెంచడానికి వారు ఎన్నడూ అంగీకరించరు.

నిరుద్యోగులైన కార్మికుల కొనుగోలుశక్తిని పెంచేందుకు అవుసరమైన రుణాలను బ్యాంకులు కార్మికులకు యిచ్చినపుడే అదనపు సరుకులు అమ్ముడుపోతాయి. కాని బ్యాంకులు కూడ పెట్టుబడిదారుల స్వాధీనంలోనే వున్నాయిగదా! లాభం వస్తుందనే నమ్మకముంటేగాని బ్యాంకులు కార్మికులకు రుణాలివ్వవు గదా! అసలు ఫాయిదాలతో సహా కార్మికులు ఆ రుణం చెల్లించ గలుగుతారని బ్యాంకు యజమానులకు విశ్వాసం లేదు. అంతేగాక కార్మికులు రుణాలను తీర్చేందుకు మార్గమేమిటి? తమ వేతనాలలోనుంచి కార్మికులు కొంత ద్రవ్యం మినహాయించుకొనుట ద్వారానేగదా రుణాలు తీర్చవలసింది! అంటే ప్రస్తుతం వినియోగించుతున్న సరుకులను కొంత తగ్గించుకుని పాత రుణాలను తీర్చాలిసివుంటుంది. అందుచేత కార్మికులకు రుణాలివ్వడంవల్ల కూడ అధికోత్పత్తి సమస్య పరిష్కారం కాదు. ఒక దశలో కొనుగోలు శక్తిని పెంచడానికి వినియోగపడిన రుణాలు, మరుసటి దశలో కొనుగోలు శక్తిని తగ్గించుతాయి. సంక్షోభాన్ని తాత్కాలికంగా వాయిదావేసి, కొత్త ఆర్థిక సంక్షోభానికి దారితీస్తాయి.

అందుచేత అధికోత్పత్తి సంక్షోభాన్ని తట్టుకోడానికి, పెట్టుబడి దారులకు లేదా కార్మికులకు బ్యాంకులు ఋణాలిచ్చినా సమస్య పరిష్కారం కాదు. పెట్టుబడిదారీ ఆర్థిక విధానమంతా లాభాలపై ఆధారపడివుంది. జనసామాన్యం యొక్క కొనుగోలు శక్తి పెరగడంపైనే లాభాలు ఆధారపడి వుంటాయి. కాని అధికసంఖ్యాకులైన శ్రామిక ప్రజల వేతనాలు చాల తక్కువగా వున్నందున వారి కొనుగోలు శక్తి, వస్తువులను వినియోగించుకునే తాహతు చాల పరిమితంగా వుంటుంది.

ఇదంతా ఒక సుడిగుండం. పెట్టుబడిదారులు తమకు లాభం వస్తేనే వుత్పత్తిని ఎక్కువ చేస్తారు: పని దొరికితేనే శ్రామిక వర్గానికి జీవితావసర వస్తువులను కొనగల తాహతు వుంటుంది. లాభాలు రానపుడు పెట్టుబడిదారులు వుత్పత్తిని బంద్ చేసి, కార్మికులకు పనిలేకుండా చేస్తారు. నిరుద్యోగులైన కార్మికులకు కొనుగోలు శక్తి లేనందున వస్తువుల అమ్మకం మరింత పడిపోతుంది ఆర్థిక సంక్షోభం మరింత తీవ్రమవుతుంది. ఈవిధంగా సమాజం పెట్టుబడిదారులు, కార్మికులు అనే రెండు వర్గాలుగా విడిపోవడమే ఈ సుడిగుండానికంతటికీ మూలం.

ఇంక లాభాలు ధారాళంగా వస్తున్న దశలో పెట్టుబడి దారులకు బాంకులిచ్చే ఋణాలను పరిమితం చేసి, అధికోత్పత్తి సంక్షోభానికి దారితీయకుండా అరికట్టవచ్చా? అనే సమస్యను పరిశీలించుదాం. ఇదికూడ పైకి బాగానే కన్పించినా ఆచరణలో సాధ్యంకాదు. ఏమంటే ప్రస్తుతమున్న

సమాజంలో పెట్టుబడిదారులకే నిర్ణాయకశక్తి వుంది. అందుచేత బాగా లాభాలు వస్తున్న దశలో పెట్టుబడిదారులకు ఋణాలివ్వరాదని బ్యాంకు యజమానులైన పెట్టుబడిదారులను నిరోధించడం ఎవరికీ సాధ్యంకాదు.

కొన్ని సందర్భాలలో ఒకేరకం వస్తువులను తయారు చేసే కంపెనీలు అధికోత్పత్తి చేయకుండా ఒడంబడికలు చేసు కోవడం చూస్తున్నాం. ఉదాహరణకు బర్మా ఆయిల్ కంపె నీకి, స్టాండర్డు ఆయిల్ కంపెనీకి మధ్య ఒక్కొకరు ఇంత సరకు వుత్పత్తి చేయాలనీ, ఇంత ధరకు అమ్మాలనీ ఒప్పందం కుది రింది. అధికోత్పత్తి ఫలితంగా ధరలు పడిపోకుండా జాగ్రత్త పడేందుకు, అధిక లాభాలను సంపాదించేటందుకే ఈ గుత్త వ్యాపార సంస్థలు ఇలాంటి ఒప్పందాలను చేసుకుంటాయి. స్వలాభాపేక్షతో జరిగిన ఇలాంటి ఒడంబడికలు సైతం ఎంతో కాలం నిలబడవు. వుత్పత్తికోటా చాలదనో, మరే సాకు తోనో ఉత్పత్తిని పరిమితి చేసే ఈ ఒడంబడికలు రద్దవు తున్నాయి.

అలాగే ఉత్పత్తిని కంట్రోలు చేసేందుకు జరిగే ఇతర ప్రయత్నాలు కూడ ఫలించవు. ఉత్పత్తిని పెంచేందుకు అప్పులిస్తున్న బ్యాంకులను కంట్రోలు చేయడంకూడ సాధ్యం కాదు. ఏమంటే బ్యాంకులకుకూడ లాభాపేక్షవుంది. అందు చేత లాభాలు సంపాదించుతున్న పరిశ్రమలకు పెట్టుబడిపెట్టి అప్పులిచ్చి లాభాలు సంపాదించడంలో వివిధ బ్యాంకులమధ్య పోటీవుండటం సహజమేగదా !

ఐతే ధరలు పడిపోయే దశలో బ్యాంకులచేత విరివిగా అప్పులిప్పించడం, ధరలు పెరిగే దశలో అప్పులను పరిమితం చేయడంవల్ల ఏవిధమైన ఫలితం వుండదనికాదు. పరిమితమైన లాభం వుంటుంది. ఆర్థిక సంక్షోభాన్ని వాయిదావేయడానికి మాత్రమే అది వినియోగించుతుంది.

అదేవిధంగా ప్రభుత్వ యంత్రాంగం ద్వారా నిరుద్యోగులైన శ్రామికులకు భృతినికూడ యివ్వడం పరిమితమైన ఫలితాలను చేకూర్చుతుంది, శ్రామికుల కొనుగోలు శక్తిని కొంతవరకు కాపాడి ఆర్థిక సంక్షోభం తీవ్రతను తగ్గించుతుంది. అలాగే పెట్టుబడిదారులకు లాభం రాని దశలో తయారైన వస్తువులకు సబ్సిడీలు యివ్వడం ద్వారా వుత్పత్తిని కొనసాగించేలా కొంతవరకు ప్రోత్సహించవచ్చు. అలాగే ప్రభుత్వం తరఫున పెద్ద పెద్ద ప్రాజెక్టులను నిర్మించేందుకు విశేషద్రవ్యాన్ని ఖర్చుచేయడంద్వారా వుత్పత్తిని కొనసాగించి, శ్రామికుల కొనుగోలు శక్తిని కాపాడవచ్చు. కీన్స్ వగైరా పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు సూచించే మార్గాలే యివి. కాని ద్రవ్య సరఫరాను క్రమబద్ధం చేసేందుకు అవలంబించే ఈ పద్ధతులన్నిటి ద్వారా తాత్కాలిక ఉపశమనాలు జరుగుతాయే గాని ఆర్థిక సంక్షోభాలను ఆపుచేయడం సాధ్యంకాదు. గత చరిత్రంతా యిదే సత్యాన్ని రుజువుచేసింది.

"సోషల్ క్రెడిట్" సిద్ధాంతవాదులు ఆర్థికసంక్షోభాలను అరికట్టేందుకు సూచించే మార్గం మరొకటి వుంది. ఉదాహరణకు ఒక దేశంలో తయారౌతున్న వస్తు సముదాయాన్నంతటినీ కొనేందుకు తగిన ద్రవ్యం ప్రజానీకం చేతుల్లో లేదు.

అందుచేతనే వస్తువులు మిగిలిపోయి ఆర్థిక సంక్షోభం వస్తోంది. అప్పులివ్వడంద్వారా వస్తువులన్నిటినీ కొనగలిగినంత ద్రవ్యం ప్రజానీకానికి అందచేయాలనీ, లేదా ప్రజల కొనుగోలుశక్తికి అందుబాటులో వుండేలాగ ధరలను తగ్గించాలనీ ఈ సిద్ధాంత కర్తలు వాదించుతున్నారు. అపుడు మార్కెటుకు సప్లయి అవుతున్న వస్తుసముదాయాన్నంతటినీ ప్రజానీకం కొనగలుగుతుందనీ, అధికోత్పత్తి ఆర్థికసంక్షోభ మనే సమస్యలు వుత్పన్నమే కావనీ వీరు వాదించుతారు.

ఇదికూడ పైకి ఆకర్షణీయంగా వున్నప్పటికీ, ఈ సిద్ధాంతం యొక్క పునాదియే సరియైనది కాదు. ఏమంటే ఆర్థిక వికాసదశలో సప్లయికంటే డిమాండు ఎక్కువగా వుంటుందని మనకు తెలుసు. అలాంటపుడు సప్లయి అవుతున్న వస్తువులను కొనగల శక్తి లేదనడం సరికాదు. అంతేగాక వికాసదశలో వినిమయవస్తువులకు గిరాకీ వుండుటతోపాటు ఉత్పత్తిసాధనాలకు భారీయంత్రాలకుసైతం గిరాకీ వుంటోంది. ఐతే ఆర్థిక సంక్షోభం రావడానికి కారణం సమాజమంతటికీ కొనుగోలుశక్తి లేకపోవడం కాదు. పెట్టుబడిదారులవద్ద ఎంత ద్రవ్యమున్నా వారు తమ అవసరాలకు మించి వినిమయ వస్తువులను కొనరు. ధరలు శ్రామికుల కొనుగోలుశక్తికి అందుబాటులో లేనపుడల్లా అధికోత్పత్తి జరిగిందని గోలపెట్టడం జరుగుతోంది. లాభాలు వస్తాయనే నమ్మకం లేనపుడు పెట్టుబడిదారులు తమవద్ద ఎంత డబ్బున్నా వుత్పత్తిని కొనసాగించేందుకు సిద్ధపడరు.

అందుచేత "సోషల్ క్రెడిట్" సిద్ధాంతం కూడ పొరపాటు వాదనలపై ఆధారపడి వుందనేది స్పష్టం. లాభంకొరకు ఉత్పత్తి జరుగుతున్న ఈ పెట్టుబడిదారీ విధానంలో ఈసిద్ధాంత కర్తలు సూచించే మార్గాలేవీ ఆచరణయోగ్యం కావు. దేశంలోని వ్యక్తులందరికి కొంత ద్రవ్యం అందచేయడం ద్వారా కొనుగోలుశక్తిని పెంచాలనే సూచనకూడ ఆచరణయోగ్యం కాదు.

ఇలా కొంత ద్రవ్యం సమాజంలోని వ్యక్తులందరికీ పంచితే ఫలితం ఏమిటి? పెట్టుబడిదారులకు మరికొంత ధనం చేరుతుంది. కార్మికులకు యిచ్చే ద్రవ్యం వల్ల జరిగేదేమిటి?

కార్మికులు తమ శ్రమశక్తిని అమ్ముకొంటున్నారు. తద్వారా సంపాదించే వేతనాలతో తమ కుటుంబ పోషణ చేసుకుంటున్నారు. పైన ఉదహరించినట్లుగా నిర్ణిమిత్తంగా కొంత ద్రవ్యాన్ని కార్మికులకు యిస్తే, పెట్టుబడిదారీ విధానమే పనిచేయదు. ఏమంటే యిచ్చే ద్రవ్యం పెద్ద మొత్తమైతే కార్మికులు తమరెక్కల కష్టాన్ని అమ్ముకునే అవసరమే వుండదు. చిన్న మొత్తమైతే ఆ వారం వేతనాలు తగ్గిపోతాయి. ఉదాహరణకు పెన్షన్లు పొందుతున్న ముసలివాళ్లు, కుటుంబాలపై అధారపడే బాలబాలికలు తక్కువ వేతనాలకు పనిచేయడం సర్వసాధారణంగా జరుగుతున్నట్లే, పైన సూచించిన మనోవర్తి పథకంవల్ల కూడ కార్మికుల వేతనాలు పడిపోతాయి.

వేతనాలను, ధరలను ఖచ్చితంగా నిర్ణయించితే, అవి పడిపోయే అవకాశం లేదనుకుంటాం. కాని పెట్టుబడిదారీ ప్రపంచంలో వేతనాలను, ధరలను ఒక పద్ధతిలో ఖచ్చితంగా నిలబెట్టడం సాధ్యం కాదు. లాభాలను కంట్రోలుచేయడం, పరిమితం చేయడం సాధ్యపడినపుడు, లాభాపేక్ష వుత్పత్తికి కీలకంగావున్న ఈ విధానాన్నే మార్చగల శక్తి ప్రజలకు వుంటుంది.

అలాంటి ప్రజాప్రభుత్వాలు సోషలిస్టు దేశాలలోనే వున్నాయి. ఆ దేశాలలో లాభాపేక్ష వుత్పత్తికి మూలం కాదు: ప్రజావసరాలే అచట వుత్పత్తికి ప్రాతిపదిక. అచట కూడ ద్రవ్యాన్ని వస్తుసంపదను వుత్పత్తి చేయడానికి సాధనంగా వినియోగించుతున్నారు. కాని సోషలిస్టు ప్రభుత్వాలు అనుసరించే ద్రవ్య నీతికి, పెట్టుబడిదారీ ప్రభుత్వాల ద్రవ్య నీతికి ఎంతో భేదంవుంది. పెట్టుబడిదారీ ప్రభుత్వాల ద్రవ్య నీతిలో వున్న లోటులను, సిద్ధాంతాలలో వున్న తప్పులను అవగాహన చేసుకునేందుకు సోషలిస్టు దేశాల ద్రవ్యనీతిని పరిశీలించడం అవసరం.

———:X:———

# 8. సోషలిస్టు సమాజంలో ద్రవ్యం - ధరలు

పెట్టుబడిదారీ సమాజంలో ఫ్యాక్టరీలు కర్మాగారాలు వగైరా వుత్పత్తి సాధనాలు, ముడిపదార్థాలు, ఆహారం వగైరా జీవితావసర వస్తువులన్నీ వ్యక్తుల లేక గ్రూపుల స్వంతఆస్తిగా వుంటున్నాయని మనం గమనించాం. వస్తు మార్పిడికి ద్రవ్యం ఎంత అవసరమో, పెద్దతరహాలో జరిగే వుత్పత్తి కంతటికి యాజమాన్యం వహించుతున్న పెట్టుబడి దారులకుద్రవ్య చెలామణి అంతఆవశ్యకమని తెలుసుకున్నాం.

సోషలిస్టుదేశమైన సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి సాధనాలు, ముడిపదార్థాలు వగైరా వ్యక్తుల లేక గ్రూపుల ఆధీనంలో వుండవు. సమస్త ప్రజానీకం తరఫున ప్రభుత్వమే వాటన్నిటికి యాజమాన్యం వహించుతోంది. అచటకూడ వ్యవసాయరంగంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలపై గ్రూపు యాజమాన్యం వున్నప్పటికీ, ప్రభుత్వ అజమాయిషీ క్రింద నడుస్తున్న సోషలిస్టు వుత్పత్తి విధానం మొత్తం శ్రేయస్సుకు అనుగుణంగానే అవికూడ పనిచేయాలిసివుంటుంది. అలాంటి సోషలిస్టు ఆర్థిక విధానంలో ద్రవ్యం పాత్ర ఏమిటి ?

ప్రజల జీవితావసరాలను తీర్చుకునేందుకు ద్రవ్యం మారకపు సాధనంగా సోషలిస్టు దేశంలో కూడ వినియోగ పడుతోంది. ఇతరదేశాలలో వలెనే నాణాలు, కర్రెన్సీనోట్ల రూపంలో ద్రవ్యం చెలామణి అవుతోంది. బ్యాంకు చెక్కులు, ఎక్ఛేంజి బిల్లులు సాయంతో పెద్ద మొత్తాల ద్రవ్యం ఒకసంస్థ నుండి మరోసంస్థకు సరఫరా అవుతోంది. ఉత్పత్తి కొరకు అప్పులు మంజూరు చేయడానికి, ద్రవ్య మారకానికి సోవి యట్ ప్రభుత్వ బ్యాంకులు వినియోగపడుతున్నాయి. సోవి

యట్ యూనియన్‌లోనూ పెట్టుబడిదారీ దేశాలలోనూ ద్రవ్యం ఉపయోగాల విషయంలో ఏమంత తేడా వున్నట్లు పైకి కన్పించదు.

ద్రవ్యానికి, ధరలకు మధ్యవున్న సంబంధాలను పరిశీలించితే మాత్రం సోషలిస్టు దేశాలకు – పెట్టుబడిదారీ దేశాలకు మధ్య చాల వ్యత్యాసం కన్పించుతుంది. సోషలిస్టు దేశాలలో కూడ ధరలు పెరగవచ్చు; కాని ఆ పెరుగుదలకు కారణం డిమాండుకు తగినంత సప్లయి లేకపోవడం కాదు; ధరల పెరుగుదలకూ వుత్పత్తికీ ప్రత్యక్ష సంబంధం వుండదు.

అలాగే, ధరలు తగ్గవచ్చు; కాని డిమాండు తగ్గడం అందుకు కారణంకాదు: ధరల తగ్గుదల వల్ల ఉత్పత్తిని తగ్గించవలసిన అవసరం రాదు. ఒకమాటలో చెప్పాలంటే సప్లయి– డిమాండుల్పై ఆధారపడి సోషలిస్టు దేశాలలో ధరల హెచ్చు తగ్గులు సంభవించవు. ధరల హెచ్చు తగ్గులపై ఆధారపడి ఉత్పత్తిస్థాయి వుండదు. ఆ దేశాల్లో పెట్టుబడిదారులూ ఉండరు; పెట్టుబడిదారుల లాభాపేక్షకు అనుగుణ్యంగా ఉత్పత్తి సాధనాలు పనిచేయడమూ ఉండదు.

సోషలిస్టు దేశాలలో ప్రధానమైన ఉత్పత్తి సాధనాలన్నీ ప్రభుత్వ యాజమాన్యాన వున్నాయి. యంత్రాలకు, ఫ్యాక్టరీలకు వున్న శక్తినంతనూ వినియోగించి వస్తువుల ఉత్పత్తి జరుగుతుంది. కార్మికుల శ్రమశక్తి విలువపై – అనగా వారి కుటుంబ పోషణకు అవసరమయ్యే కనీస ద్రవ్యంపై వారి కొనుగోలుశక్తి ఆధారపడి వుండటంలేదు. దేశంలో లభ్యమయ్యే వస్తుసముదాయానికి అనుగుణ్యంగానే కార్మికుల కొనుగోలు

శక్తి వుంటున్నది. ప్రతి సంవత్సరం తయారయ్యే వస్తు సముదాయాన్ని అనుసరించి, ధరలు వేతనాలు నిర్ణయించుతున్నారు. అందుచేత తయారయ్యే జీవితావసర వస్తువులన్నీ, ఆ సంవత్సరంలోనే ఖర్చయిపోతున్నవి. ఉత్పత్తి పెరిగే కొలదీ వేతనాలు కూడ పెరుగుతున్నాయి. ఉత్పత్తికి, పంపకానికి ఈ విధంగా సమన్వయం చేయడానికి కొంతకాలం పట్టింది. పరిశ్రమలపైన, వర్తకంపైన ప్రభుత్వ యాజమాన్యం విస్తరించే కొలదీ నైపుణ్యాం పెరిగి, వుత్పత్తి - పంపకాలను సమన్వయం చేయడం సులభమయింది.

సోషలిస్టు దేశాలలో అనుసరించే ద్రవ్యనీతి అంతటికి పరమాశయం ప్రజల కవసరమైన వస్తు సముదాయాన్ని తయారుచేయడమే. ఉత్పత్తి ప్రణాళికలో రెండు ప్రధాన భాగాలుంటాయి. (1) ప్రజలు తక్షణమే ఉపయోగించుకునే వినిమయ వస్తువులు (2) ఫ్యాక్టరీలు, యంత్రాలు, రైల్వేలు, ఓడలు, హైడ్రో - థర్మల్ ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులు వగైరా ఉత్పత్తి సాధనాలు. ప్రస్తుతమున్న ఉత్పత్తి సాధనాలతో ఎంతవరకు వినిమయ వస్తువులను తయారుచేయాలో, ఎంతవరకు నూతన వుత్పత్తి సాధనాలను తయారుచేయాలో ప్రభుత్వమే నిర్ణయించుతుంది. ఈవిధంగా ఒక ప్రణాళికను అనుసరించి ప్రభుత్వ ఫ్యాక్టరీలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోనూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనూ, సహకార సంస్థలలోనూ మొత్తం వినిమయవస్తువులు ఎన్ని తయారౌతున్నాయో అంచనా వేస్తారు. వీటిని కార్మికులకు, రైతులకు, ప్రభుత్వోద్యోగులకు, సైనిక శాఖలకు ఏవిధంగా పంపకం చేయాలో నిర్ణయిస్తారు.

ఈ విభజన సర్వసాధారణంగా ద్రవ్యరూపంలో జరుగుతుంది. కొరతగావున్న సరుకులను మాత్రం యుద్ధకాలంలో రేషనింగ్ పెట్టినట్లుగా, మనిషి 1 కి ఇన్నిగజాల గుడ్డచొప్పున ఇవ్వాలని నిర్ణయిస్తారు. ఇతరవస్తువు లన్నిటినీకూడ యిలాగే సప్లయిచేయాలని నిర్ణయించుతారు. ప్రజలలో ఆయా విభాగాలకు యిచ్చే వేతనాలను, భత్యాలను వస్తుపంపకానికి అనుగుణ్యంగానే నిర్ణయించుతారు. వేతనాలు, భత్యాలు ద్వారా మొత్తం ప్రజలకు ఆ సంవత్సరం పంచే ద్రవ్యంతో ఆ సంవత్సరం తయారయ్యే వినిమయవస్తువు లన్నిటినీ కొనే అవకాశం వుండేలా ఈ యేర్పాటు జరుగుతుంది. ప్రారంభంలో వుత్పత్తి అంచనాలగురించి, వేతనాల ద్వారా ప్రజలకు అందజేసే ద్రవ్యమొత్తాన్ని గురించి కొన్ని చిక్కులను ఎదుర్కొన్నప్పటికీ, అనుభవం వచ్చేకొలదీ అంచనాలు సరిగా వేయడం, వేతనాలను సరిగా నిర్ణయించడం సాధ్యమయింది.

సోషలిస్టు దేశాలు అనుసరించే ద్రవ్యనీతిలో వ్యక్తులు ఉత్పత్తి సాధనాలను స్వంత ఆస్థిగా కలిగివుండేందుకు ఇతరుల శ్రమశక్తిని కొనేందుకు అవకాశం లేదు. అందుచేత అచట ద్రవ్యం పెట్టుబడిగా చెల్లుబడికాదు.

అలాగే ద్రవ్యం మారకపు సాధనంగా వినియోగపడటంలో కూడ పెట్టుబడిదారీ దేశాలకు సోషలిస్టు దేశాలకు మధ్య తేడావుంది. సోషలిస్టు విధానంలో ప్రజల ఉపయోగంకొరకు వస్తువులు తయారు చేయబడుతున్నాయి; కొలదిమంది వ్యక్తుల లాభంకొరకు కాదు. అందుచేత సోషలిస్టు దేశాలలో మార

కపు విలువ పరిగణనలోకి రాదు. ఒక వస్తువును తయారు చేయడానికి వినియోగించిన శ్రమగంటలకు ఆ వస్తువు ధరకు సంబంధం వుండవలసిన అవసరం లేదు. వారానికి కార్మికునికి సప్లయిచేసే కనీస జీవితావసర వస్తువుల మారకపు విలువను అనుసరించి, లేదా వాటిని తయారుచేసే శ్రమగంటలను బట్టి కార్మికుని వేతనం నిర్ణయించడం లేదు. ధర చెల్లించి వస్తువులను ద్రవ్యంతో కొంటున్నారు; వేతనాలు కూడ ద్రవ్యంలో చెల్లించుతున్నారు. రెండు సందర్భాలలో కూడ వస్తువులను ఒకరి నుంచి మరొకరికి మార్చేందుకు ద్రవ్యం మారకపుసాధనంగా వినియోగపడటం లేదు. ప్రజల అవసరాల నిమిత్తం తయారుచేయబడిన వస్తువులను పంచడానికి మాత్రమే ద్రవ్యం వినియోగపడుతుంది. అందుచేత సప్లయి - డిమాండులను అనుసరించిగాని, మార్కెటులో మారకపు విలువను అనుసరించిగాని వస్తువుల ధర నిర్ణయించబడటం లేదు. కనుకనే సోషలిస్టుదేశాలలో వేర్వేరు దుకాణాలందు వేర్వేరు ధరలకు వస్తువులు అమ్ముతున్నారు.

ఉదాహరణకు ఒక ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులకు జీవితావసర వస్తువులు సప్లయి చేసేందుకు ఆ ఫ్యాక్టరీ మేనేజ్మెంటు ఆధ్వర్యం క్రిందనే ప్రత్యేక దుకాణాలు నిర్వహించబడుతాయి. అలాగే కార్మికులకు ప్రత్యేక క్యాంటీనులు వుంటాయి. వీటిలో సర్వసాధారణంగా ధరలు తక్కువగా వుంటాయి. పెద్ద వేతనాలు లభించే వుద్యోగులు, నిపుణులు వగైరాకు వస్తువులు సప్లయి చేసేందుకు ప్రత్యేక దుకాణాలు వుంటాయి. వీటిలో ధరలు హెచ్చుగా వుంటాయి. అలాగే

విదేశస్తులకు, యాత్రికులకు వస్తువులు సప్లయి చేసేందుకు ప్రత్యేక దుకాణాలున్నాయి.

వివిధ వృత్తులలో పనిజేసే కార్మికుల వేతనాలు నిర్ణయించేటప్పుడు, ఆవృత్తి కార్మికుల అవసరాలను, వివిధ పరిశ్రమల అవసరాలను దృష్టిలో వుంచుకుంటారు. ఒక పరిశ్రమలో ప్రత్యేక శిక్షణ, నైపుణ్యంగల కార్మికులు ఎక్కువమంది అవసరమనుకుంటే వారి వేతనాలను హెచ్చుస్థాయిలో వుంచుతారు. ఉదాహరణకు సత్వర పారిశ్రామికాభివృద్ధికి మొట్ట మొదటి దశలో భారీపరిశ్రమల నిర్మాణం అవుసరం. అందు చేత భారీపరిశ్రమలలో పనిజేసే కార్మికులకు, వినిమయవస్తువులను తయారుచేసే కార్మికులకంటే హెచ్చు వేతనాలు యిస్తారు. ఈ సందర్భంలో ప్రత్యేకంగా గమనించవలసిన దేమిటంటే మొత్తం ప్రణాళికలో భాగంగానే వేతనాల నిర్ణయం కూడ జరుగుతుంది. మొత్తం వుత్పత్తి అయిన వస్తు సముదాయమంతా వేతనాల ద్వారా ప్రజలకు పంచుతారు. అందుచేత వేతనాలు చెల్లించడానికి వినియోగించుతున్న ద్రవ్యమంతా వస్తుసముదాయాన్ని ప్రజలలో పంచడానికి ఉపయోగపడుతోందనేది సుస్పష్టం.

ప్రభుత్వంచే నిర్వహించబడుతున్న ఒక సంస్థ నుంచి మరోసంస్థకు అమ్మకం, కొనుగోలు జరిగేటపుడు బ్యాంకు చెక్కుల ద్వారా ఎక్ఛేంజి బిల్లుల ద్వారా ద్రవ్యం సరఫరా చేయబడుతోంది. ఉదాహరణకు విద్యుచ్ఛక్తి సంస్థకు బొగ్గు కావాలంటే బొగ్గుసంస్థకు ధర చెల్లించాలి. ఇలా ఒక ప్రభుత్వ సంస్థనుండి మరోప్రభుత్వ సంస్థకు జరిగే వస్తుమార్పిడికి కూడ ద్రవ్యం అవసరం ఏమిటి? అనే ప్రశ్న సహజంగా వస్తుంది.

రెండు సంస్థలనూ నిర్వహించుతున్నది ప్రభుత్వమే ఐనప్పటికి ద్రవ్యం అవసరమౌతుంది. అలాగే పెట్టుబడిదారీ దేశాలలో సైతం ఒకే యజమాని క్రింద వున్న రెండు పరిశ్రమల మధ్య అమ్మకం, కొనుగోలు జరిగినపుడు కూడ ద్రవ్య మార్పిడి జరుగుతోంది. ఒకే కంపెనీ నిర్వహించు తున్న రెండుశాఖల మధ్య కూడ యిదేవిధంగా ద్రవ్యమార్పిడి జరుగుతోంది, అలా ద్రవ్యం చెల్లించడం, వేర్వేరు శాఖలకు వేర్వేరు అకౌంట్సును వుంచడం, ఆ యా శాఖలు ఎలా పని చేస్తున్నాయో తనిఖీచేయడానికి అవుసరం. అందుకే పెట్టు బడిదారు తన యాజమాన్యం క్రింద వున్న రెండు కంపెనీలకు వేర్వేరు లెఖ్ఖలు వుంచుతున్నాడు. ఒకే కంపెనీ రెండు శాఖలకు వేర్వేరు లెఖ్ఖలు వుంచుతోంది.

అదేవిధంగా సోషలిస్టు దేశాలలో ప్రభుత్వం నిర్వ హించుతున్న వేర్వేరుసంస్థలకు వేర్వేరు లెక్కలు వుంచు తోంది. ఒక సంస్థకూ మరోసంస్థకు మధ్య కొనుగోలు, అమ్మకం జరిగినపుడు ద్రవ్యం చెల్లించడం కూడ పరిపాటిగా వుంది. ఏదైనా సంస్థలో సక్రమంగా వుత్పత్తి జరగడంలేదను కుంటే ఆ సంస్థను పెట్టుబడిదారీ దేశాలలోవలే — మూసి వేయరు. అందుకు కారణాలను పరిశీలించి, మానవ శ్రమకు తగిన ప్రతిఫలం లభించునట్లుగా, ఆ సంస్థ నిర్వహణను బాగు చేస్తారు. మానేజ్‌మెంటులోని లోట్లను తొలగించుట ద్వారాను కార్మికుల నైపుణ్యాన్ని పెంచడం ద్వారాను వుత్పత్తిని పెంచుతారు. సోషలిస్టు దేశాలలో ప్రతిసంస్థ లక్ష్యం ప్రజలకవసరమైన వస్తు సముదాయాన్ని తయారు

చేయడమేగాని లాభాపేక్ష కాదు. అందుచేత ప్రజావసరాలకు వినియోగించే వస్తువులను తయారుచేసే ఏ సంస్థనూ మూసి వేయను.

దీనినిబట్టి సోషలిస్టు దేశాలలో ద్రవ్య చెలామణి మొత్తం ప్రణాళిక లక్ష్యానికి లోబడి, దాని కనుగుణంగా వుంటుందని బోధపడుతుంది. అంతేగాని ద్రవ్యానికి నిర్ణయాత్మక పాత్ర లేదు. సోషలిస్టు దేశాలలో ద్రవ్యాన్ని పెట్టుబడిగా వినియోగించే హక్కు ఏవ్యక్తికీ లేదు. వుత్పత్తి మానవుల అవసరాలను తీర్చేందుకు జరుగుతుందే గాని యజమాని లాభంకొరకు కాదు.

## ప్రభుత్వ రుణపత్రాలు ఎందుకు?

ఐతే దీనికి ఒక మినహాయింపు మాత్రం వుంది. సోషలిస్టు దేశాలలో వ్యక్తులు తాము సంపాదించే వేతనాలను తక్షణ అవసరాలకు ఖర్చుపెట్టుకోవడంతో పాటు, ప్రభుత్వ రుణపత్రాలను కొనడం ద్వారా కొంత భాగాన్ని భవిష్యత్తు ఉపయోగం నిమిత్తం దాచుకోవచ్చు. ఇలా వ్యక్తులనుండి తీసుకున్న రుణాలకు ప్రభుత్వం వడ్డీ యిస్తుంది. పైకిచూస్తే ఈ విషయంలో పెట్టుబడిదారీ దేశాలకు సోషలిస్టు దేశాలకు మధ్య ఏమంత తేడా కన్పించదు. ఏమంటే వ్యక్తులనుండి తీసుకునే ఋణాలకు ప్రభుత్వం వడ్డీ అసలు ఫాయిదాలతో సహా తిరిగి చెల్లించుతుంది. ఐతే ఈ విషయంలో కూడ సోషలిస్టు దేశాలలో ద్రవ్యం ప్రత్యేక పాత్రను నిర్వహించుతోంది.

సోషలిస్టు దేశాల ప్రణాళిక, ప్రభుత్వ బడ్జెటుల ఖర్చు పద్దులో పరిశ్రమలను నిర్వహించడానికి ముడిపదార్థాలను

కొనడానికి, వేతనాలు చెల్లించడానికి అయ్యే ఖర్చులను చేరుస్తారు. రెవిన్యూపద్దులో పరిశ్రమల్లో వచ్చే ఆదాయాన్ని, పన్నుల వసూళ్ళను, ప్రజలనుండి తీసుకున్న ఋణాలనుకూడ చేరుస్తారు. ఈవిధంగా రెవిన్యూపద్దులో ఋణాలను చేర్చే బదులు, ఖర్చుపద్దులోని వేతనాలు వగైరా తగ్గించి జమా ఖర్చులను సరిపెట్టవచ్చు.

కాని ఋణపత్రాల ద్వారా రెవిన్యూ ఆదాయాన్ని పెంచడంవల్ల, వేతనాలను తగ్గించుటద్వారా వచ్చే ఇబ్బంది లూడవు. వ్యక్తులకు తమ ఆదాయాన్ని ఖర్చుపెట్టుకోడానికి మరింత స్వేచ్ఛ లభించుతుంది. ఎక్కువ అవసరాలున్నవారు అవి తీర్చుకునేందుకు అవకాశం లభించుటతో పాటు, తక్కువ అవసరాలున్నవారు తమ వేతనాలలో కొంతభాగాన్ని ప్రభుత్వానికి అప్పిచ్చే అవకాశ ముంటుంది. మొదటి తరగతి వ్యక్తులు తమ వేతనమంతటినీ ఖర్చుచేసేందుకు అవకాశ ముంటుంది. రెండో తరగతి వ్యక్తులు తమ వేతనాలలో కొంత భాగాన్ని భవిష్యత్తులో ఉపయోగించుకునే నిమిత్తం ప్రభుత్వ ఋణపత్రాలను కొంటారు. ఇందువల్ల ఇంకా కొరతగా వున్న వినిమయవస్తువుల వాడకం కొంత పరిమితం చేయడానికి వీలుంటుంది.

యువదంపతులు తమ కుటుంబం చిన్నదిగా వున్నపుడు ప్రభుత్వ ఋణపత్రాలకు ద్రవ్యం చెల్లించి, తమ కొనుగోలు శక్తిని నిల్వచేసుకుంటారు. భవిష్యత్తులో ఆదంపతుల కుటుంబం పెరిగి, తమ అవసరాలు ఎక్కువైనపుడు వాటిని తీర్చుకోడానికి, ప్రభుత్వం వడ్డీ అసలుఫాయిదాలతో, తిరిగి చెల్లించే ద్రవ్యం వినియోగించుకుంటారు. ఏమంటే అప్పటికి వినిమయ

వస్తువుల వుత్పత్తి పెరిగి, కొరత లేకుండా పోతుంది. ప్రజలందరి అవసరాలకు సరిపోయినన్ని వినిమయ వస్తువులను అందజేయవచ్చు.

ఋణాలద్వారా ప్రభుత్వంవద్దకు ద్రవ్యం చేరినందున ఆ సంవత్సరం ప్రభుత్వం ప్రజలకు అందజేయవలసిన వినిమయ వస్తువులను పరిమితంచేసేందుకు అవకాశమున్నది. ఉత్పత్తిసాధనాలను, భారీపరిశ్రమలను వృద్ధిచేసేందుకు ముడిపదార్థాలను కొనేందుకు, వేతనాలు చెల్లించేందుకు ద్రవ్యం ఎక్కువగా లభ్యమవుతుంది. అందుకే సోషలిస్టు ప్రభుత్వాలుకూడ ఋణపత్రాలను జారీచేస్తున్నవి.

ఐతే ప్రభుత్వ ఋణపత్రాలకు వడ్డీని చెల్లించవలసిన అవసరం ఏమిటి? ద్రవ్యం తనంతగా అదనపు ద్రవ్యాన్ని వుత్పత్తి చేయదుగదా? అలాంటపుడు ఋణపత్రాలకు ప్రభుత్వం ఎందుకు వడ్డీ చెల్లించాలి? అనే ప్రశ్నలు సహజంగానే వస్తాయి.

పెట్టుబడిదారీ సమాజంలో అలవడిన వ్యక్తిగత దృక్పథం, యింకా జనసామాన్యంలో మిగిలివుంది. తక్షణ అవసరాలను తగ్గించుకొనుటద్వారా ప్రభుత్వ ఋణపత్రాలను కొంటున్నవారు, ఉత్పత్తి సాధనాలను పెంచేందుకు ద్రవ్యాన్నిచ్చి ప్రభుత్వానికి తోడ్పడుతున్నారు. అందుచేత ఋణపత్రాలకు తిరిగి ద్రవ్యం యిచ్చేటపుడు అసలుతోపాటు కొంత వడ్డీని కూడ ప్రభుత్వం చెల్లించుతోంది. వినిమయ వస్తువులు కొరతగా వున్నంతవరకు ఇది అవసరమే: తక్షణ అవసరాలను తగ్గించుకొనుటద్వారా ప్రభుత్వానికి సాయపడుతున్నవారిని ప్రోత్సహించడానికి ఇది అవసరమే. అలాగే

వ్యక్తిగత దృక్పథాన్ని, త్యాగానికి తగిన ప్రతిఫలం అపేక్షించే మనస్తత్వాన్ని సంతృప్తి పరచడానికి కూడ ఇది అవసరమే.

ఈవిధమైన ఏర్పాటు తాత్కాలికమైనది మాత్రమే. వినిమయవస్తువుల కొరత తీరినపుడు వాటి ఉత్పత్తి పెరిగి జనులందరికి సమృద్ధిగా అందజేయగలిగినపుడు ప్రభుత్వం ఋణపత్రాలను జారీచేయవలసిన అవసరమూ వుండదు; వడ్డీ చెల్లించవలసిన అవసరమూ వుండదు.

అందుచేత సోషలిస్టు దేశాలైన సోవియట్ యూనియన్ వగైరా దేశాలు వుత్పత్తి శక్తులను పెంచడానికి తీవ్రంగా కృషిచేస్తున్నాయి. సర్వతోముఖాభివృద్ధిని సాధించిన కమ్యూనిస్టు సమాజంలో వినిమయవస్తువుల కొరత వుండదు. వ్యక్తులు తమ అవసరాలను పరిమితం చేసుకోవలసిన అవుసరం వుండదు. ప్రజలందరి అవసరాలను తీర్చేందుకు వస్తుసముదాయం సమృద్ధిగా వుంటుంది. ఒకమాటలో చెప్పాలంటే కమ్యూనిస్టు సమాజంలో "ప్రతి ఒకరూ తమ శక్తికొలదీ పనిజేసి, తమ అవసరాలన్నిటినీ తీర్చుకునేందుకు" అవకాశముంటుంది. అపుడు మానవుల దృక్పథంలోనే మార్పు వస్తుంది. పెట్టుబడిదారీ సమాజం అవశేషాలైన ద్రవ్యాపేక్ష? వ్యక్తిగత దృక్పథం కమ్యూనిస్టు సమాజంలో క్రమంగా నశించుతాయి.

అపుడు సర్వజన శ్రేయస్సుకొరకు తమ శక్తికొలదీ కృషిచేయడం వ్యక్తులందరూ తమ ధర్మంగా ఎంచుకుంటారు. సమాజమంతటి శ్రేయస్సులో వ్యక్తుల ప్రయోజనాలు అంతర్భాగమై పోతాయి.

---